6-12-1991 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 62 సంచిక 48 విడిప్రతి : రు 1.50లు

Regd No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



### హనుమంతుపైకి ముఖ్యమంత్రి సంధించిన నరసింహాస్త్రం

# కొత్త పిసిసి నేత జగన్నాథరావు?

పిసిసి అధ్యక్ష ఎన్నికపై హనుమంతరావు పెంచుకొనిన ఆశలను అడియాసలు చేయడానికి ముఖ్యమంత్రి శ్రీ జనార్థన రెడ్డి పెద్ద ఎత్తువేశారు. ఏఐసిసి ప్రకటించిన కార్యక్రమం ప్రకారం ఈ పాటికి కాంగ్రెస్ పార్టీ ఎన్నికలు గ్రామస్థాయి నుంచి హైదరాబాదు వరకు జరుగిపోయి వుండాలి. హనుమంతరావు చాలా తెలివిగా మొత్తం ఎన్నికలు తన ఇష్టప్రకారం జరిగిపోయేట్లు పథకం రచించుకున్నాడు. దాని ప్రకారం జిల్లాలలోనూ, రాజధానిలో కూడా తన వారనుకున్నవారిని రిటర్నింగ్ ఆఫీసర్లుగా నియమించాడు. ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ఏఐసిసి అధ్యక్షుడిగా ఎంపిక కావాలంటే వంగర స్థాయి నుంచి ఎన్నికవుతూ రావలసి వుంటుంది. కాబట్టి కార్యక్రమములో మార్పులేకుండా ఎన్నికలు జరిపించేస్తానని ప్రకటించాడు. ఆ కారణంగా అలస్యంగా వచ్చారన్న సాకుతో పలువురు జిల్లా నాయకులు తెచ్చిన వోటర్ల జాబితాలను తిరస్కరించాడు. ఈ పథకం ఫలించివుంటే క్రింది నుంచి పై వరకు హనుమంతరావు అభ్యర్థులే పార్టీ కమిటీలు పెత్తనంలోకి వచ్చి వుండేవారు. పిసిసి నేతగా ఆయన సులువుగా ఎంపికై పోయి ఉండేవాడు.

ముఖ్యమంత్రి శ్రీ జనార్థనరెడ్డికి ఈ పథకం గురించి అలస్యంగా తెలిసింది. అప్పటికప్పుడు ఆయన ఢిల్లీ పెద్దలతో మాట్లాడి మొత్తం ఎన్నికను వాయిదా వేయించేశాడు. అప్పటికీ హనుమంతరావు ఢిల్లీకి పరుగులు పెట్టినా ఫలితం లేకుండా పోయింది. ముఖ్యమంత్రితో సంబంధం లేకుండా పిసిసి ఎన్నిక తతంగం నిర్వహించడానికి వారు ఒప్పుకోలేదు. ఎన్నిక వాయిదా పడినంతనే తనకు జరిగే మేలేమి లేదన్నవాస్తవం ముఖ్యమంత్రికి తెలుసు. హనుమంతరావు న్యూసెన్స్ శాశ్వతంగా తప్పించడానికి ఈ ఎన్నికలను ఒక అవకాశంగా వాడుకోవాలి. అందుకే ఆయన మాజీ ఉప ముఖ్యమంత్రి శ్రీ జగన్నాథరావును రంగంలోకి దించాడు.

జగన్నాథరావు తెలంగాణా నాయకుడు, ప్రధాని శ్రీ పి.వి.కి సన్నిహితుడు. అయితే అనారోగ్య కారణాలవల్ల ఆయన ఇటీవల రాజకీయాలకు దూరంగా గడుపుతున్నారు. ఎక్కువ కాలం ఆస్పత్రిలోనే వుండి పోవలసి వస్తున్నది. కానీ పిల్చి పెత్తనమిస్తానంటే ఎంతటి హృద్రోగమైనా అడ్డంకి కాదు కదా. జగన్నాథరావుగారు ముఖ్యమంత్రి

### రాజధాని రాజకీయం

పిలుపు తనకు చేరగానే రెక్కలు కట్టుకొని వాలిపోయాడు. ఢిల్లీకి పరుగెత్తెళ్ళాడు. పివి ఆశీర్వచనం అందగానే బహిరంగంగా రంగంలోకి దిగాలన్నది పథకం.

జగన్నాథరావు అభ్యర్థిత్వం వల్ల జనార్థనరెడ్డికి పలువిధాల లాభం. పివి అభ్యర్థిగా ముగ్గులోకి వస్తే అసమ్మతి నాయకులు తోకాడించలేరు. హనుమంతరావు పోటీకి దిగినా నిలువలేరు. పైపెచ్చు వోటర్ల జాబితా సవరణ, రిటర్నింగ్ ఆఫీసర్లవునఃర్నియామకంవంటివన్నీ జగన్నాథరావే చూసుకుంటాడు. నరసింహాస్త్రంవలె తానువదులుతున్న ఈ అభ్యర్థిత్వం ముఖ్యమంత్రికి పార్టీలో సైతం పట్టు సంపాదించి పెడుతుంది.

ఇది ఇట్లా వుంటే హనుమంతరావు ఒకవైపు డాక్టర్. వై.యస్. రాజశేఖరరెడ్డి మద్దతు కోరుతూ మరో వైపు జనార్థనరెడ్డితో రాజీ . దోరణిలో ప్రవర్తించడం పరిశీలకులకు అర్థంకాని సమస్యగా మిగులుతున్నది. మొన్న జరిగిన పిసిసి కార్యవర్గ సమావేశంలో హనుమంతరావు జనార్థనరెడ్డికి ఎక్కడ లేని మర్యాద ఇచ్చాడు, ఐదు నిమిషాలు అలస్యం జరిగితే ఆగలేక జెండా ఎగురవేసిన పిసిసి అధ్యక్షుడు ముఖ్యమంత్రి అరగంటకు పైగా అలస్యంగా వచ్చినా ఎదురు చూచి సమావేశం జరుపకుండా నిలిపాడు. ముఖ్యమంత్రి కారు వరకు ఎదురేగి స్వాగతం చెప్పడమే కాదు తిరిగి

కొరప 12 పేజిలో

# ఛేర్మన్ల ఎంపికలో మాదాలకు చీవాట్లు

కార్పొరేషన్ ఛేర్మన్ నియామకాలలో ఎమ్మెల్యేలకు కారు, గిరు వున్న వసతులు దొరికితే పాపం మంత్రి శ్రీ మాదాల జానకిరాంకు తలవాచిపోయే చివాట్లు తప్పకుండా ప్రకటించేశాడు. ముఖ్యమంత్రి నిజంగా జానకిరామ్ సిఫార్సులను ఆచరిస్తాడో లేక ప్రక్కన పెట్టి తన జాబితాను తయారు చేసుకుంటాడో తెలియదు కాని పత్రికల్లో పేర్లు రాగానే ఎమ్మెల్యేలందరు జానకిరామ్‌ను శాపనార్థాలు పెట్టడం మొదలు పెట్టారు. తమ పేరు ఇరికించనందుకు తిట్లకు ఎత్తుకున్నారు. అదృష్టవశాత్తు ఛీఫ్ విప్ తప్పించుకున్నాడు కాని,

కొరప 12 పేజిలో

### హైదరాబాద్ లేఖ

మిగులుతున్నాయి. ఏ ఎమ్మెల్యేలకు ఏవి పదువులు ఇవ్వాలనే ఎంపిక బాధ్యతను ముఖ్యమంత్రి జానకిరాంకు అప్పజెప్పాడట. ఆయన,ఛీఫ్ విప్ శ్రీ సి.వి. శేషారెడ్డిని కూర్చో బెట్టుకొని ; మూడు రోజులు తల పగల గొట్టుకొని ; ఎమ్మెల్యేల జాబితానంతటిని ఒకటికి పది సార్లు పై నుండి క్రింది వరకు చదివి అందులో అస్మదీయులెవరో, తస్మదీయులెవరో కనిపెట్టి ;

ఎవరికి పదవి ఇస్తే ఎవరు అలుగుతారో, ఎవరికి పదవి ఇవ్వకుంటే ఎవరికి కోపం వస్తుందో ; కేబినేట్ ర్యాంక్ ఇస్తే తప్ప తీస్కోనని బ్లాక్‌మెయిల్ చేస్తున్నవారెవరో ఇచ్చిన పదవి ఏదైనా సంతృప్తి పడే అల్ప సంతొషులెవరో ; కార్పొరేషన్‌గిరితో అసమ్మతీయులను సమ్మతీయులగా మార్చే అవకాశాలు ఎక్కడెక్కడ వున్నాయో పరిశీలించి, పరిశోధించి, పరీక్షించి ముఖ్యమంత్రికి జాబితా అప్పజెప్పాడు. ఈ తతంగమంతా ప్రక్కనే వుండి పరికిస్తుండిన అంతఃపురవీశేఖరి ఒకరు ప్రక్క రోజు పేపరులో వరుస నెంబరు

# ఛీఫ్‌సెక్రటరీకి సాయిబాబాసిఫార్సు?

రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ నటరాజన్ పదవీ కాలాన్ని మరొక ఆరు నెలలు పాటు పొడగించడం వెనుక మర్మమేమిటన్న విషయంపై రాజధాని ఐఎఎస్ వర్గాలలో పెద్ద ఎత్తున చర్చలు జరుగుతున్నాయి. నటరాజన్ మొన్న 30 తేది రిటైర్ కావలసివుండింది. ఆయనస్థానంలో శ్రీ ఆరోరాను నియమించడానికి ఫైలు సిద్ధం చేసి వుంచారు. అయితే ఏమి జరిగిందో ఏమో ఆఖరు నిమిషంలో ఆయననే మరి ఆరునెలలు పాటు కొనసాగింప చేస్తూ ఉత్తర్వు చేశారు.

నటరాజన్ మొదటి నుంచి నిఖార్సయిన అధికారిగా పేరు పొందినవాడు. ఎవరినీ లెక్క చేయక పోవడం ఆయన తత్వం. ముఖ్యమంత్రుల సొంత ఫైళ్ళను తేలిగ్గా తిప్పి కొట్టగల సాహసికుడు. అందువల్లే ఏ రాజకీయ వాదికి ఆయనంటే సరిపడదు. అటువంటి అధికారిని ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా తప్పించడానికి, వదిలించుకోవడానికి ప్రయత్నిస్తారు తప్ప, రిటైరైనా కొనసాగించడానికి నిర్ణయించారంటే, పెద్ద కారణమే వుండితీరాలి. అది ఏమిటి అన్నదే ప్రశ్న.

కొరప 7 పేజిలో

# హృదయాంజలి



పూజ్యులు
శ్రీ ఆరుగుంట దశరథరామిరెడ్డి గారు

మాయమాయె మీ నిత్య దర్శనంబు
దూరమాయె మీ వెలుగు బాట.
కోల్పోతిని మీ మంచి మాట
ఉంటారు నాలో నడిపిస్తారు మీవెలుగులో
మెలిగాను మీతో గురు శిష్యుల భావంతో
లేదు లేదు —మిమ్ము తలువని రోజు
కోరలేదుచెడు మీరు శత్రువులకు కూడా
దాన ధర్మమే మీ ట్రస్టుకు పునాది
ఓడిపోయారు మీరు కాల సర్పంతో
రోజుకాదు నెలకాదు యిరువది నాలుగు
సంవత్సరములు కలిసి ఉన్నాను
మీతోసదా కోరుతాను భగవంతుని మీ
ఆత్మశాంతికై
మీ ప్రియాతి ప్రియమైన శిష్యుడు
దామవరపు ఆదిశేషారెడ్డి

(సవేరా – మద్రాసు)

## నవ్వి పోదురుగాక, నాకేటి సిగ్గు ?

# ఒక్క సభ్యుడూలేని అనాధ జిల్లా కాంగ్రెస్ కమిటీ !

నెల్లూరు జిల్లా కాంగ్రెస్ ఈరోజు ఒక విచిత్రమైన పరిస్థితిని ఎదుర్కొంటున్నది. జిల్లా కాంగ్రెస్ కమిటి అధ్యక్షుడి నుంచి కార్యకర్త వరకు ఏ కాంగ్రెస్ వారూ ఈ వార్త వ్రాసే సమయానికి (6తేది) కాంగ్రెస్‌పార్టీ సభ్యులు కారు. ముఖ్యమంత్రితో సహా ఎమ్మెల్యేలకు మండలాధ్యక్షులకు, మంత్రికి కూడా ప్రాథమిక సభ్యత్వం లేదు. ఒక్కరంటే ఒక్క సభ్యుడు కూడా లేని అనాధగా మిగిలిపోయింది కాంగ్రెస్ సంస్థ. పార్టీ నియమావళిననుసరించి సాంకేతిక పరంగా చూస్తే పరిస్థితి అదే!

జిల్లా కాంగ్రెస్ సంఘాలు నవంబరు నెలాఖరులోగా సభ్యత్వ కార్యక్రమం పూర్తి చేయాలని పిసిసి ఆదేశం. ఆ రోజుకు ఎన్నికలు కూడా జరిగిపోవాలి. కాంగ్రెస్‌లో ఇటువంటి తేదీలు ప్రకటించడం, ఆ తర్వాత మర్చిపోవడం మామూలే కదా! జి కాం అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి గారు పాత పద్ధతినే పాటించి సభ్యత్వం ప్రసక్తి ఎత్తుకోలేదు ఆఖరి క్షణంలో ప్రమాదం గ్రహించి ముఖ్యమంత్రి శరణు జొచ్చే సరికి ఆయన సభ్యత్వం రుసుము క్రింద కట్టమని 60 వేలు ఇచ్చారట హైదరాబాద్‌లోనే కూర్చొని తెల్ల కాగితాలపై పేర్లు వ్రాసి, కాళ్ళతో చేతులతో వేలి ముద్రల్లు అద్ది, సంతకాలు దిద్ది వరుసగెత్తుకుంటూ పిసిసి కార్యాలయం వెళ్ళారట. కాని అక్కడుండేది హనుమంతరావు కదా?

> జి కాం కమిటీ అలసత్వం వల్ల ముఖ్యమంత్రి నుంచి మామూలు కార్యకర్త వరకుకాంగ్రెస్ సభ్యత్వం కోల్పోయారు.

ఆయన తీరిగ్గా జాబితాసాకపారి పరికించి, సమయం మించిపోయింది. సారీ, ఇంటికి దయ చేయండి అన్నారట. ఆ మాటలతో జి కాం పెద్దలు హతాశులైపోయారు. చేయగల్గిందేమి లేక తిరిగి వచ్చేశారు. ఫలితంగా జిల్లాలో కాంగ్రెస్‌పార్టీ అన్నదే లేకుండా పోయింది. అందరూ సభ్యత్వ విహీనులైనారు. పిసిసి ఎన్నికల్లో పాల్గొనడానికి ఎవరికీ అర్హత లేకుండా పోయింది. గ్రామ, మండల, జిల్లా కమిటీలు అస్థిత్వం కోల్పోయాయి. ఇప్పుడు పిసిసి అధ్యక్షుణ్ని బ్రతిమలాడి, నెల్లూరు జిల్లా వారలకు సభ్యత్వమిప్పించేందుకు చాలా ఉన్నత స్థాయిలో ప్రయత్నిస్తున్నారు; ప్రాధేయపడుతున్నారు. ఈరోజు, రేపట్లో ఏదో ఒక రాజీ కుదరవచ్చునని వార్త.

ఒక్క గూడూరు నియోజకవర్గం నుంచి మాత్రం ఎమ్మెల్యే శ్రీ పత్రా ప్రకాశరావు 3 నెలల క్రితమే డిసిసితో సంబంధం లేకుండా నేరుగా పిసిసికి ఒక సభ్యత్వ జాబితా సమర్పించి, డబ్బు కూడా కట్టినాడట. అందువల్ల ఆ ప్రాంతంవారు మాత్రం సభ్యత్వాలు నిలుపుకోగలిగారు.

కాంగ్రెస్‌కు ఎందుకీ దుర్గతి? ఎందుకింత దురవస్థ? పార్టీకి ఆఫీసు వుంది అధ్యక్షుడు ఉన్నాడు; సిబ్బందికి జీతాలు చెల్లిస్తున్నారు; వాహనం ఉంది; అయినా సభ్యత్వ—హారాలు సకాలంలో

కొరవ 11 పేజీలో

# పినాకిని తీరం

## వ్రాసేచెయ్యిపూరకుండదు!

తిరిగే కాలు, తిట్టే నోరే కాదు, వ్రాసే చెయ్యికూడా పూర కుండదు. ఆచాపల్యం అటువంటిది. వ్రాతకు దూరంగా వుండాలంటే వార్తా పత్రికలకు, రేడియో దూరదర్శన్ వార్తలకు దూరంగా వుండాలి. చదివినా విన్నా స్పందన లేకుండా వుండాలి. అంటే ప్రపంచానికి దూరంగా ఏకారడవిలోనో కాపురంవుండ గలగాలి. అటువంటి నిగ్రహం, పరిత్యాగం సామాన్యులకు సాధ్యమా?

చెయ్యాక్యక ట్టే వ్రాకొని వుండలేకనే... వారాల తర్వాత మా పాఠకుల మధ్యకు వస్తున్నాను. ఎట్టకేలకు మా డాక్టర్ 'సిందూర రామచంద్రా రెడ్డి గారు ఇంట్లో కూర్చొని నాలుగక్షరాలు గోక్కోవడానికి అనుమతి మంజూరు చేశారు. డాక్టర్ల చేతిలో పడకుండా వుండాల్నే గాని, ఒక సారి పడ్డతర్వాత పాడం గొట్టేస్తారు; వారి ఆదుపాజ్ఞలలో ఉండిపోక తప్పని పరిస్థితి కల్పిస్తారు. అయినా యంత్రమ్మ అయిన బ్రహ్మ ఇంత అసిత్తు గుండెను ఎందుకు అమరుస్తాడో తంచు కొంటే ఆశ్చర్యంగా వుంటుంది. తేనె మనసు అంటారు, అమృత హృదయం అంటారు, వెన్న మనసు అంటారు, రాతిగుండెలంటారు. పిటలో యేదీ కాక పోయినా తుమ్మితే వూడి పోయే ముక్కు వంటిది కాకుండా కాస్త దృఢ మైనది పెడితే ఆయన దేమి పోయింది అని నిలేసి అడగడానికి మనకు కనపడేవాడు కాదు; అవసరానికి కనపడేది డాక్టర్లే!

"పురజనుల కోర్కెమీద మరో ప్రదర్శనం" అని పూర్వం నాటకాల కరపత్రాల్లో వేసేవారు. పురజనుల కోర్కెలేదు మట్టిలేదు; పురజనుల పాకులతో తమకు తాము మరో ప్రదర్శనావకాశం కల్గించుకోవడమేఅది! చాపల్యంతో తప్ప నావ్రాతను కొనసాగించడం ఎవరి కోర్కె మీదకాదు. వ్రాతపూర్వకంగా, వాగ్రూపంగా కోరిన మిత్రులు లేకపోలేదు. ఆ విషయంలో తొలిగా వచ్చిన కార్డు తినారెగారిది. చివర మూడు అక్షరాలుండే ఆశీర్షికను ఆపకండి అంటూ ఆయన కోరాడు. ఆ విధంగా అనేక మంది అనుకోండి! మొదట్నే చెప్పినట్టు వ్రాసే ఓపిక ఉత్సాహాలు లేవు. అయినా చేతిని కట్టి వేసుకోలేకనే కాగితం మీద కలం పెడుతున్నాను.

## ఎందుకీ ప్రకటనలు?

ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి మీద మరింత విరుచుక పడేట్టు చేయడానికి తప్ప దీటికి మాటికి ఆయూత్ కాంగ్రెస్ జంట కవుల పత్రికా ప్రకటన లెందుకు చెప్పండి? దిన పత్రికల జిల్లా ఎడిషన్లకు మేత, తమ పేర్లు తరచూ అచ్చులో కనపడడానికి తప్ప దీటివిలువేమిటి? ప్రయోజన మెంత, ఆలోచించండి! యూత్ కాంగ్రెస్ అంటే ఐక్యంగా వుండే ఒక సంఘమన్నా అయితే అటువంటి ప్రకటనలకు బలము, ఫలితము వుంటాయి గాని పీలిక పీలికలుగా వుండే అసంస్థకు ఎంత ప్రతి పత్తి, పలుకుబడి వుంటాయి?

నెల్లూరుకు సంబంధించి యూత్‌కాంగ్రెస్ కనీసం నాలుగు ముక్కలై పోయి వుంది. జనార్దనరెడ్డి దొకటి; డాక్టర్ చెన్నారెడ్డిది ఇంకొకటి; పిసిసి అధ్యక్షుడు హనుమంత రావుది మరొకటి; ఆఖరుగా నాలుగవది జె.కె.ది! నాకు తెలియకుండా మరికొన్ని వున్నాయేమో చెప్పలేను. ఇందులో ఆయన వర్గీయులు తమ తమ నాయకుల అనుకూలంగా ఖండన మండనాలకు దిగితే కాలక్షేపానికి చదివి నవ్వుకోవడం తప్ప వాటిని లెక్కపెట్టే వారుంటారా? దేవకుమార్ రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి ప్రకటన విలువ కూడా అంతే; ఆమాటంటే వారి మనసు నొచ్చుకోవచ్చు. కాని వాస్తవం అంతే! జనార్దనరెడ్డిని సమర్థిస్తానో విమర్శిస్తానో ఈయువ నాయకులే కాదు; వేమారెడ్డి, శేషారెడ్డి, పసం, పత్రాలు చేసే పత్రికా ప్రకటనలు; శ్రీరామ మూర్తి అనుకూల వ్రాతలు సర్వసాధారణం, షరామామూలు క్రింద పరిగణిస్తారేగాని, వాటికి ప్రత్యేకత వుండదు. ఇతరులిస్తే వాటికి అందము చందము, విలువ వుపయోగమున్నా!

శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి ఏదో ఆపరేషన్ చేయించుకొని ఆస్పత్రిలో వున్నాడు. ఒక సారి చేయించుకున్నాడట; ఆపెండిక్స్

కొరవ 11 పేజీలో

# జమీన్‌రైతు

## విచారకరం

ఎల్‌టిటిఇ తీవ్ర వాదులతో తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధికి గల సంబంధాలపై వెలువడుతున్న, వార్తలు, వెల్లడౌతున్న వాస్తవాలు చూస్తుంటే విస్మయం కల్గుతున్నది. విచారపడాల్సి వస్తున్నది. తమిళ భాషాభిమానంతో నరరూప రాక్షసులుగా పేరు పొందిన ఎల్‌టిటిఇ హంతక ముఠాను రక్షించడానికి ఆశ్రయం కల్పించడానికి రాష్ట్రప్రభుత్వ యంత్రాంగాన్ని వాడారని తమిళనాడు మాజీ హోం సెక్రటరీ నాగరాజన్ చెప్పిన మాట వింటే మన రాజకీయవాదులు ఎంతగా దిగజారిపోతున్నారా అన్న ఆందోళన కల్గుతున్నది.

శ్రీలంకలోని తమిళుల పోరాటం పట్ల, ఎల్‌టిటిఇ సంస్థ పట్ల పలువురు తమిళ నాయకుల వలె కరుణానిధికి కూడా సానుభూతి వుందన్న విషయం తెల్సిందే కాని, అది పద్మనాభ వంటి మరొక తమిళ నాయకుణ్ని తీవ్రవాదులు చంపినా సమర్థించేంత తీవ్రంగా వుందని ఎవరూ ఊహించలేదు. కేంద్ర నేర పరిశోధక సంస్థలు ఈ కూపీని వెలికి తీసి హోం శాఖ మాజీ కార్యదర్శిని అరెస్టు చేసి, నిజాలను చెప్పించిన తర్వాత యావద్భారతదేశం దిగ్భ్రాంతికి లోనైంది.

తీవ్రవాదులతో రాజకీయ వాదుల సన్నిహిత సంబంధాలు ఒక్క తమిళనాడుకు, ఒక్క కరుణానిధికి పరిమితం కాదు. పంజాబ్‌లో, కాశ్మీర్‌లో, అస్సాంలో, డార్జిలింగ్‌లో జార్ఖండ్‌లో, ఈశాన్య రాష్ట్రాలలో, ఆఖరకు ఆంధ్రలో సైతం తీవ్రవాదులు రాజకీయవాదులను ఆశ్రయించి వారి సహకారంతోనే తమ హింసాకాండలు కొన సాగిస్తున్నారు. ఎన్నికలలో తీవ్రవాదుల సహకారంతీసుకోవడం పరిపాటి అయిపోయింది. తెలంగాణా జిల్లాలో నక్సలైట్లతో సంబంధం లేని పార్టీ, నాయకుడు లేడు. భయంతోనో, అవసరం కోసమో ప్రతి ఒక్కరూ నక్సలెట్లతో సన్నిహిత సంబంధాలు నెరపుతున్నారు. పోలీసులు గాలింపు చర్యలు ఉధృతం చేసినప్పుడల్లా నక్సలైట్లు దాక్కొనేది రాజకీయనాయకుల ఇళ్ళలోనే. నక్సలైట్లకు జామీను ఏర్పాటు చేసేది. ఎమ్మెల్యేలు, మండాలాధ్యక్షులే ! తమిళనాడు లోనూ అదే జరుగుతున్నది, జరిగింది.

జయలలితకు తన పై గల ద్వేషంతో అమాయకుడైన తనను ఈ వివాదంలో ఇరికించారని వాపోతున్నాడు కరుణామ్మె. దొరికిన దొంగలెవరైనా చెప్పే కథలివే. తీవ్రవాదులతో వారి హత్యకాండతో అణుమాత్రం సంబంధం వున్నదని రుజువైనా మామూలు పౌరులపై ఎటువంటి చర్య తీసుకొంటారో కరుణానిధి పై సైతం అదే చర్య తీస్కోవాలి. రాజకీయకక్షలు తీర్చుకునే ఉద్దేశ్యంతో కాకుండా, చట్టం అమలు చేయాలన్న సత్సంకల్పంతో ఈ పని జరిగితే, దేశం వ్యాప్తంగా వున్న తీవ్రవాదమిత్రులైన రాజకీయ నాయకులకు అదొక హెచ్చరికగా పనికి వస్తుంది. తమ వ్యక్తిగత అవసరాలకొ, లేదా వ్యక్తిగత అభిమాన దురభిమానాలతోనో దేశ ద్రోహులైన తీవ్రవాదులతో చేతులు కలిపే ప్రతి వ్యక్తిని, నాయకుడిని కఠినంగా శిక్షించగల్గితేనే ఈ హంతకుల విచ్చలవిడి అరికట్టే వీలౌతుంది.

తమిళనాడులో "జయలలిత ప్రదర్శిస్తున్న సాహసం, చిత్తశుద్ధి మన నాయకులకూ వుంటే నక్సలైట్లను అదుపులో పెట్టడం అంత కష్టమా ?





5.12.1941

10 పేజీలు. అణా

### సత్యాగ్రహము

మేనకూరు వీర్రాఘవ రెడ్డి గారు 4 తేది విడుదలై 6 తేది మధ్యాహ్నం యక్సుప్రెస్‌లో నెల్లూరు వస్తారని తెలుస్తున్నది.

అన్ని ఆంధ్ర జిల్లాల కాంగ్రెసు ఏజంట్లు వెంటనే సత్యాగ్రహం చేయవలసినట్లు ప్రకాశం పంతులు సాదరు చేసారు.

కాని నెల్లూరు ఏజంటు వంగల్లు కోదండరామరెడ్డి గారికి హిందూ మహమ్మదీయ కలహాల్లో నష్టపడ్డ బాధితులకు సాయము జేయు రిలీఫ్ కమిటీ బాధ్యత ప్రకాశం పంతులే నెత్తిన వేస్తూ వీరికి మాత్రం ప్రస్తుతం మినహాయింపు యిచ్చారు.

### కీ.శే. మైదవోలు చంగయ్య పంతులు

రా.బ. చంగయ్య పంతులు గారు మద్రాసులో 29.11.41న స్వర్గస్థులైరి. వీరు నెల్లూరులో సుప్రసిద్ధ న్యాయవాదిగ నుండి ప్రజాజీవితంలో ప్రధాన స్థానము గలిగి వుండిరి. రాజాగారి కాలేజి కమిటీ అధ్యక్షుడుగను ఫండాఫీసు అధ్యక్షులుగను, మునిసిపలు ఛేర్మన్‌గను వుండిరి. చాలా కాలము పబ్లిక్ ప్రాసిక్యూటరుగా నుండి ఎండోమెంటు బోర్డు కమీషనరుగా మద్రాసుకు బోయిరి.

### మునిసిపల్ మీటింగు

#### నెల్లూరు

నవంబరు 29 తేది న జరిగిన నెల్లూరు మునిసిపల్ సమావేశంలో 1941–42 బడ్జెటు ప్యాసు చేయించారు.

### 50 ఏళ్ళ క్రతం ఈ వారం

మలేరియా నివారణకు రు. 1560 రోడ్లకు రు. 24000, కమ్యూనికేషనులకు రు. 3000, శాంక్షన్ చేసారు. ఎలిమెంటరీ స్కూళ్ళ అక్టింగ్ టీచర్ల జీతాలు రు.15 నుండి 20 కి హెచ్చించారు. ప్రకాశం రిలీఫ్ కమిటీకి రు. 500 శాంక్షన్ చేసారు. 11 తేదిన స్పెషల్ మీటింగు జరువుటకు నిర్ణయించారు.

### హై స్కూలు సెలక్షన్

వి.ఆర్. హై స్కూలులో సెలక్షనుకు

6

మాసాలు పరీక్షలు డిసెంబరు 4 తేది నుండి జరువుతున్నారు. ఈ సంవత్సరం టీచర్ల మార్పులు, విద్యార్థులకు పాఠాలు జరక్కపోవడం, మతకలహాలవల్ల స్కూళ్ళు మూతబడడం మున్నగు గొడవలెన్నో వున్నవి. ఏ కారణమైతేనేం విద్యార్థులకు పాఠాలు జరుగలేదు కావున ఈ సంవత్సరం సెలక్షన్సు తీసి వేయడం నబబుగా వుంటుంది.

### నెల్లూరు మిషన్ స్కూల్

నిన్న నెల్లూరు మిషన్ హైస్కూలు 6 వ ఫారం విద్యార్థి ఒకరు బొట్టు పెట్టుకున్నాడని, శివాజీ పటాన్ని పూజించాడని సస్పెండు చేసి ఈ దినం క్లాసుకు రానిచ్చారట. పిల్లలు ఈ సందర్భంలో సమ్మె చేసి వదలిరి.

### భావతరంగాలు

సి.యె.యం. హై స్కూలు పిల్లలు క్రీస్తు మతానికి విరోధము గాని శివాజీ పటాన్ని వేసుకున్నా, జిన్నా పటాన్ని తగిలించుకున్నా తటస్థ్యమైనా, ఔదార్యమైనా చూడడం ఉచితం ; కాకుంటే మేకులు పెరికిన కోతి గతి అవుతుందేమో !



# రూపాయి విలువ కంటె వేగంగా రాజకీయ విలువల పతనం

ఆర్థిక రంగంలో రూపాయి విలువకంటే స్పీడుగా సామాజిక రంగంలో రాజకీయ నాయకుల నైతిక విలువలు దిగజారి పోతున్నాయి. లేకుంటే పిసిసి అధ్యక్షుడి వంటి బాధ్యతాయుతమైన పదవిలో వున్న వ్యక్తి, ప్రధాన మంత్రి సమక్షంలో ఒక ముఖ్యమంత్రిని పట్టుకొని ''పోరాపో'' అనడం ఏమిటి ? కారులో సీటు ఇవ్వలేదనే కోపంతో ప్రజల సమక్షంలో పత్రికల వారి ఎదుట అధికారుల ముందు ఇట్లా మాట్లాడడం, అలబరి జనం వలె తగువులాడుకోవడం ఎంత సంస్కారహీనమైన విషయమో నాయకులకు తెలిసినట్లు లేదు. పదవులను గౌరవించనవసరం లేదు. కనీసం సాటి మనిషికి ఇవ్వవల్సిన మర్యాద కూడా తెలియని వారు నాయకులగానే కాదు మనుషులుగా కూడా చెప్పుకోవడాన్కి అనర్హులు.

రాజీవ్‌గాంధీ ఒకసారి ముఖ్యమంత్రి అంజయ్యను అగౌరవపరస్తూ ఒక మాట వాడితే ఆంధ్ర ప్రజలందరూ దాన్ని తమకు జరిగిన అవమానంగా భావించి ఆగ్రహం వ్యక్తం చేసి కాంగ్రెసును చిత్తుగా ఓడించారు. ఇప్పుడు అంతకంటే హీనమైన ఈ పరిస్థితి పట్ల ప్రజలు ఎట్లా ప్రతి స్పందించాలి ? ప్రజాప్రతినిధులుగా, ఆదర్శ ? పాయులుగా వుండ వలసిన వారు కూర్చొనే కుర్చీల కోసం తిట్టుకోవడం చూస్తే రాష్ట్రంలో రాజకీయవిలువలు ఎంతగా పతనమైపోయాయా అన్న ఆవేదన కల్గుతున్నది. ఈ పతనం సామాజిక వాతావరణాన్నే కలుషితం చేస్తున్నది. మన నాయకమన్యులలో సంస్కృతి, సంస్కారాలు ఎప్పుడు అభివృద్ధి చెందుతాయో, నిస్సహాయులైన ప్రజలకు ఎప్పుడు ముక్తి దొరుకుతుందో !

నెల్లూరు – వి. అనంతరామయ్య




### సంస్కార హీనుడు హనుమన్న

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుల వారు ముఖ్యమంత్రిని 'పోరా' అన్నాడంటే అది అతని సంస్కారానికి గుర్తు. ఒకవేళ వారు అనుకున్నట్లు పొరపాట్లు జరిగినా ''ఒరే, తురే '' అనే హక్కు ఆయనకు లేదు. కలెక్టర్ను గూడా ప్రొటోకాల్‌ని గురించి దూషించాడట. అసలు ప్రొటోకాల్ అంటే వీరికి అర్థం తెలుసా ?

ఈ కీచులాటలు కాంగ్రెస్ పార్టీకి మంచివి కాదు. ప్రొటోకాల్ అనీ, సెక్యూరిటీ అని, రకరకాల పేర్లతో ఒక్కొకరికి పది పదిహేనుమందిని కావలిపెట్టిప్రజల డబ్బు దుబారా చేస్తున్నారు. ఇట్లా పెట్టుకుంటూపోతే రేపు పంచాయితీ మెంబరు కూడా తనకి ఇద్దరు పోలీసుల్ని కాపలా పెట్టమంటాడు. దేశంలో ఇక మనుష్యులే మిగలరు. ఉన్న జనాభా అంతా యీ కాపలాకే సరిపోతుంది.

నెల్లూరు — యల్.వి.రావు

### ట్రంకురోడ్డులో పాదచారుల పాట్లు !

గాంధీ బొమ్మ వద్దనుండి ఏ.సి. బొమ్మ వరకు పాతకాలంలో రోడ్డుకు ఇరువైపులా ఫ్లాట్‌ఫారమ్ కొరకు పైపులు బిగించారు. కొన్నాళ్ళకి వాటిని తీసివేశారు. ఆ పైపులు నిలబడేందుకు నేల మీద సిమెంటుతో కట్టిన గుబ్బలు ( దిబ్బగా ) అట్లాగే ఉండిపోయాయి.

ముఖ్యంగా పిల్లలు, స్త్రీలు అంగళ్ళు చూచుకుంటూ క్రిందనున్న సిమెంటు దిబ్బలను గమనించక తట్టుకొని పడుతున్నారు. ఇటీవల వరద రోజుల్లో నీరు పారుతూవుండడం చేత ఒక ఆమె తట్టుకొని పడి చెయ్యి విరగ గొట్టుకున్నది. మున్సిపాలిటీ వారు వెంటనే ఈ సిమెంటు గుబ్బలను తొలగించి పాదచారుల పాట్లను నివారించ వల్సిందిగా కోరుతున్నాను.

నెల్లూరు — యనమల శ్రీనివాసులు నాయుడు

# సెక్స్ విద్య నిద్రావస్థే ఎయిడ్స్ వ్యాధికి మూలం !

AIDS అనేది పొడి పదం మాత్రమే. పది పదం చెప్పాల్సి వస్తే Acquired – Immuno Deficiency Syndrome అంటారు. ఇటీవల కాలంలో ప్రజల్ని ప్రపంచమంతటా ప్రకంపన పర్చి, చిత్రంగా పెట్టి బెంబేలెత్తించిన వ్యాధి మరేది లేక పోయినప్పటికీ సకల దేశ ప్రజల్ని తత్తర పెట్టేదు ప్రస్తుతానికి. కొన్ని సెక్షన్ల ప్రజల్ని, కొన్ని దేశ జనాల్ని మటుకే ప్రస్తుతం ఇది ఎక్కువగా పీడిస్తున్నది. (H.I.V.) Human Immuno Virus దీనికి కారణమని తేలింది.

వ్యాధి గూర్చిన లక్షణాలు తెల్సుకునే ముందుగా, కొన్ని క్షణాలు ఆ రోగం గూర్చి కొన్ని కూపీలు తెల్సుకుందాం. తొలుత అమెరికాలో న్యూయార్క్ నగరంలో ఓ రోగి నుండి ఈ వ్యాధి వునికిని కనుగొనడం జరిగింది. ఆ రోగి 'ఆడ' కాదు 'మగ' కాదు. ఈ రోగానికి గల అంటు రోగ లక్షణం, అని వార్యమగు మృత్యు గుణం. మూలాన ఆ నాటి నుండి ఈ 'ఎయిడ్స్' వ్యాధి గూర్చి నలు దిశలా అధికంగా రచ్చవడం అన్ని దేశాల పత్రికల్లో అచ్చవడం జరిగింది. జరుగుతూనే వున్నది. ఈ వ్యాధి ఉనికి అంతర్జాతీయ ఆరోగ్య సంస్థలన్నింటికీ పెద్ద సమస్యయింది భూగోళమంతటా దీనిపై పెద్ద సంచలనం మొదలయ్యింది. అమెరికన్ (U.S.A) జనంలో నైతే భయమనే ప్రభంజనం ప్రారంభమయింది. దేశదేశాల మెడికల్ జర్నల్స్, మ్యాగజైన్లు, కరకు వార్తా పత్రికల్లో సహితం ఎప్పటికప్పుడు దీని గూర్చిన వార్తల వరదలు పోర్లసాగాయి.

1981 నుండి 84 లోగా ఒక్క అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోనే 1400 కేసులు నమోదయ్యాయి రూఢిగా. 84 చివరికంతా పై సంఖ్యలో సగం పైగా వెళ్ళారు కాటికి. ఆ మిగతా వారు కూడా ఈ పాటికి విగత జీవులై వుంటారు – ఆ వ్యాధి ధాటికి. ఈ రోగానికి సంబంధించిన

**డాక్టర్. జె. పి. రెడ్డి**
ఎం.బి.బి.యస్., ఎఫ్.ఎస్.ఇ

సమస్త విషయ సేకరణకుగా, పరిశోధనలకుగా ఇప్పటికే అర్జెంటైనా, కెనడా, మెక్సికో, హైతీ, ట్రినిడాడ్‌టోబాగో, ఐర్లాండు, ఇటలీ నెదర్లాండు, డెన్ మార్క్, స్విట్జర్ లాండ్, స్వీడన్, స్పెయిన్, ఫ్రాన్సు, బెల్జియం, జైయిర్, సౌత్ ఆఫ్రికా, ఆస్ట్రేలియా, జపాన్లలో అనేక సంస్థలు వెలిశాయి. USA లో వున్న సంస్థలు సరిగా పని చేయడం లేదని, సెంటర్ ఫర్ ఎయిడ్స్ డిసీజ్ కంట్రోల్ అనబడే ఇన్స్టిట్యూషన్లకు అధిక నిధులు, కేటాయించాలనీ, ప్రభుత్వం పై వత్తిడి తెచ్చారు. దాని మీదట ప్రజల అభ్యర్ధనను మన్నిస్తూ 1985 లో కోట్ల రూపాయలు అదనంగా ఎయిడ్స్ పరిశోధనా సంస్థలకు మంజూరు చేసింది ప్రభుత్వం.

ఎంత చేసినా దాని అంటురోగ లక్షణం మూలంగా ప్రాణాంతక తత్వం మూలంగా అమెరికా (USA) లో 1988 ఫిబ్రవరి నాటికి 39 వేల మంది ఆ వ్యాధికి బానిస లై అందు 26, 667 మంది బలైనట్లు కరెంట్ డేటా. ఇదియిలాగే కొన సాగితే 2000 సంవత్సరానికంతా ఒక్క USA లోనే పది కోట్ల మంది కి వ్యాధి సోకే అవకాశం అగుపిస్తున్నట్లు అమెరికాలోని డా. ఎవరెట్ కూప్ తెలియజేసారు. సెక్స్ విద్యలో పరిపూర్ణత లేని కారణంగా, ముఖ్యంగా ఆ విద్యకు ప్రాముఖ్యతనివ్వడం ధాంధనులు అడు పడటం వలన సెక్స్ విద్య నిద్రావస్థలో వుండటం వల్లనే, ఈ వ్యాధి బరితెగిస్తున్నదని ఆయన ఉద్దేశ్యం. ఒక్క అమెరికాలోనే గాక 1989 నాటికి తీసిన గణాంక వివరాల ప్రకారం బ్రిటన్‌లో 1206, పాశ్చాత్య దేశాల్లో 2226 కెనడాలో 1213 ఆస్ట్రేలియాలో 84, జపాన్‌లో 76 కేసులు బయట పడ్డాయి. బంగ్లాదేశ్ పాకిస్తాన్, సిలోన్‌లలో, శ్రీ లంక, సింగపూర్లలో ఇప్పటి దాకా దాని వినికిడి లేదు.

అమెరికాలో ఇలా ఇది విశృంఖల నాట్యం మొదలు పెట్టేసరికి ఆ దేశంతో పోల్చ దగిన ఇతర నాగరిక మునుగులోని

కొరవ 10 పేజిలో

# సణుగుడు

* విప్లవ సాహిత్య పఠనంనుంచి సత్యసాయికి సాగిల బడడం వరకు...

ముఖ్యమంత్రుల వ్యక్తిగత విశ్వాసాలు, అలవాట్ల గురించి పబ్లిక్‌గా చర్చించ వలసిన అవసరం లేదు. ప్రజా జీవితంలో వుండేవారి విషయాలు పరామర్శించడానికి శ్రీశ్రీ చెప్పిన కొలమానం క్రిందకు ఈ అంశం వస్తుందో లేదో కూడా నాకు తెలియదు. అయితే 'ఆశ' అన్న ఒకే ఒక్క పదం మనిషి వ్యక్తిగత జీవితంలో ఆదర్శాలు, అభిప్రాయాల క్రమంలో ఎంతటి మార్పు తెస్తుందో తెలియజెప్పడానికే ఈ నాలుగు మాటలు !

ముఖ్యమంత్రి శ్రీ ఎస్. జనార్ధనరెడ్డి మొన్న నవంబరు 22తేది పుట్టపర్తిలో సత్యసాయిబాబాకు సాగిలపడి సాష్టాంగ నమస్కారం చేశారు. భారత రాష్ట్రపతి, భారత ప్రధాన మంత్రి అంతటి వారు ప్రత్యేక కార్యక్రమాలు వేసుకొని పుట్టపర్తికి వచ్చి పాదపూజలు చేసి పోతున్నప్పుడు ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి సత్యసాయిబాబాకు వందనం చేయడంలో వింతేమీ లేదు, విడ్డూరమూ కాదు. ముఖ్యమంత్రి స్థాయి కల్గిన వ్యక్తుల శిరసులను సాయిబాబా పాదారవిందాలు ఇప్పటికి ఏ వంద సార్లో, రెండు వందల సార్లో స్పృశించి వుంటాయి. అలకపాన్పు ఎక్కిన సత్యభామతో శ్రీ కృష్ణపరమాత్ముడు చెప్పినట్లు నాయకుల శిరస్సులు తగిలి బాబా గారి పాదాలు కంది వుంటాయే తప్ప శిరస్సులకేమీ ప్రమాదం లేదు.

జనార్ధనరెడ్డి వ్యక్తిగత జీవితంతో పరిచయం కల్గినవారికి ఈ సాష్టాంగ నమస్కారం అచ్చెరువు గొల్పే అంశమే. జనార్ధనరెడ్డి మొదటు నుంచి ఆస్తికుడు కాదు ; నాస్తికుడన్నా తప్పులేదు. పూజలు, పునస్కారాల పట్ల ఆసక్తి లేదు ; జ్యోతిష్యం వంటి వాటిని నమ్మేవాడే కాదు. ముఖ్యమంత్రి అయ్యేవరకు, ఎప్పుడైనా మనస్పూర్తిగా దేముడికి దండం పెట్టివుంటాడా అనేది సందేహమే ! పైపెచ్చు రాజకీయ తొలిదశలో ఆయన విప్లవ సాహిత్య పాఠకుడు. ఆ రోజుల్లో ప్రభుత్వం నిషేదించిన తీవ్రవాద సాహిత్యం సైతం ఆయన దగ్గరుండేది.

అస్తికత్వం పట్ల అంతటి

కొరవ 12 పేజిలో

# న్యాయవాదుల పోరాటం న్యాయమేకాదు – అవసరంకూడా !

నెల్లూరు టౌన్ పోలీసులకు న్యాయవాదులకు మధ్య చెలరేగిన వివాదం చిలికిచిలికి గాలివాన అవుతున్నది. స్థానికంగానే అయినప్పటికీ, రెండు వ్యవస్థల మధ్య పెద్ద సంఘర్షణకు దారి తీస్తున్నది.

మెజిస్ట్రేట్ కోర్టులో విచారణకు హాజరైన ఒక ముద్దాయి తన భార్యతో కలిసి తిరిగి వెళ్ళే సమయంలో ఇద్దరు పోలీసు కానిస్టేబిళ్ళు రోడ్డా ఆపి, కొట్టారట. అది చూసిన మహబూబ్ భాషా అనే న్యాయవాది పోలీసులను నివారించడానికి ప్రయత్నించేసరికి, పోలీసులు ఎదురుగా తిరిగి అతడికి తమ భాషలో అక్షంతులు వేశారట. ఆ న్యాయవాది తక్షణం కోర్టుకు వచ్చి,

**సింహపురి**

మేజిస్ట్రేట్‌కు పరిస్థితి వివరించి, అఫిడవిట్ రాఖల చేశాడట. మేజిస్ట్రేట్ దానిపై సంబంధిత పోలీసు స్టేషన్‌లోని కానిస్టేబిళ్ళందురూ కోర్టకు హాజరు కావాలని ఆదేశించారు.

దీనిపై రెచ్చిపోయిన కానిస్టేబిళ్ళ కోర్టు బాత్‌రూం వద్దకు వెళ్ళ కేసు పెట్టిన న్యాయవాదిని తిట్టారట. అడ్డు వచ్చిన మరోక న్యాయవాదిని అదే రీతిలో సత్కరించి, బయటకు రాండి తేల్చుకుందాం. అనే తీరులో బెదిరించారట. ఈ సంఘటనతో లాయర్లందరూ బిత్తరపోయారు. కోర్టు ఆవరణంలో, కోర్టు జరిగే సమయంలో న్యాయవాదులను పోలీసు కానిస్టేబిళ్లు తిట్టడం బెదరించడమనేది . తేలికగా తీసుకొదగిన విషయం కాదు. అందులోనూ ఒక ముద్దాయికి రక్షణ కల్పించారనే నెపంపై పోలీసులు ఇలా వ్యవహరించడం ఆందోళన కల్గినున్నది. పోలీసులు బెదిరించడం మొదలు పెడితే, వారి బెదిరింపులకు భయపడడం మొదలైతే ఇక ఏ న్యాయవాది ఏ ముద్దాయికి అనుకూలంగా వాదించగలడు ? అందువల్లే ఈ సంఘటనపై న్యాయవాదు లందరూ ఐక మత్యంతో ప్రతి స్పందించారు. పోలీసులు క్షమాపణ చెప్పాలని, బెదరింపులకు దిగిన కానిస్టేబిళ్లను సస్పెండ్ చేయాలని ఆందోళన చేస్తూ కోర్టులు బహిష్కరించారు. వారికే మద్దతుగా జిల్లాలోని న్యాయవాదులందరూ ఆందోళనకు దిగడంతో ఏ కోర్టులోనూ పని జరగడం లేదు.

కొరవ 11 పేజిలో

# "ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను" – కృష్ణశాస్త్రి

ఈతరం కుర్రకారుకు కృష్ణశాస్త్రి అంటే ''సినిమా కవుల్లో ఆయన ఒకరు గదూ, అన్నట్లు, 'నది రేయి ఏ జాము నో' నీ వుండే దా కొండ పై.....' 'అందాల ఓ మేఘమాల ...' వగైరా పాటలు ఆయన వ్రాసినవేగదూ అనటందాకా చేతనవుతుంది కాని ఆయన కవిత్వతత్త్వ రహస్యాన్ని పట్టి యిచ్చే 1925 నాటి ఆయన ''కృష్ణపక్షం'' కావ్యాన్ని చేటుచ్చుకొని కన్నీరు నింపటం చేత కాదు. ''కన్నీరు నింపటానికా కావ్యాలు చదువ వలసినది ? ఇదేనా కావ్యప్రయోజనము ?'' అని ప్రశ్నించే నీరసులకు నేనిచ్చే సమాధానం పఠితకు అవేశంగా వుట్టుక వచ్చే కన్నీరే కావ్యానందానికి నిజమైన గుర్తు. అసలు ఏల ఏడ్వవలె ? ఏడు పెందుకు రావలె ? ఏల మనం షేక్స్పియరు ట్రాజెడీని చదివి వ్యధ చెందవలె ? ఏల మనం శరత్‌బాబు నవల 'దేవదాసు 'ను తెరపై చూచి కలుక్కుమన్న గుండెతో చిత్రశాల నుండి మగిడి రావలె ? ఏల మనం విశ్వనాథ్ 'అంధ భిక్షువు' .ను గాని శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి'ని గాని చదివి లేదా విని బహిరంగంగా కాకపోయినా ఆత్మలో కన్నీరు మున్నీరు కావలె ?

ఈ దుఃఖము మాట విడిచి ప్రేమను తీసుకుంటే – తన పిరికి తనంతో తనకు గాక పరాయిదై పోయిన పార్వతిని దేవదాసు ఏల అనుక్షణమూ స్మరిస్తూ త్రాగుబోతు కావలె ? పార్వతిని మరిచి తన్ను నిరంతరమూ గాఢమైన ప్రేమతో

**కవుల పలుకులు**
**+**
**రసిక్**

సేవిస్తోన్న చంద్రముఖిని ఏల చేపట్టక పోవలె ? ఏల వర్డ్స్ వర్త్ (Words Worth) ప్రకృతిని ప్రేమించి తదారాధనలో మునిగిపోవలె ? ఏల ఆ మహాకవికి సన్నిహిత మిత్రుడైన ఛార్లెస్ లాంబ్ (Charles Lamb) ప్రకృతి విరుద్ధమైన నాగరక జీవనమును, లండన్

కొరవ 11 పేజిలో

# నెల్లూరు చుట్టుపట్ల

## విమర్శకుడు

### చింతామోహన్

కేంద్ర ఎరువులు, రసాయనాల మంత్రి శ్రీ చింతామోహన్ రేపు (7 తేది) నెల్లూరు వస్తున్నారు. తడ సమీపంలోని జాలరి కుటుంబాలు సందర్శించి, తమిళనాడు, ఆంధ్ర జాలర్ల మధ్య వున్న తగువులను పరిష్కరించే ప్రయత్నం చేస్తారు.

దుమ్ములకు దూరంగా వుండాలనే ఆలోచనని అనుసరించేనేమో, చింతామోహన్ గారు నెల్లూరు టౌన్‌వైపు కూడా ముఖం చూపడం లేదు; మంత్రి అయిన తర్వాత కూడా తన నియోజక వర్గానికే మాత్రమే పరిమితమై వెళ్లి పోతున్నాడు.

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి 22 తేది నెల్లూరు పర్యటనకు రావచ్చునని అనధికార వర్తమానం. బుచ్చి కాలేజీ ప్రారంభోత్సవం వంటి కార్యక్రమాలున్నట్లున్నాయి.

### మంత్రులు

గనుల మంత్రి శ్రీ మాదాల జానకిరాం 1 తేది సాయంత్రం హైదరాబాదుకు తిరిగి వెళ్లారు.

× × ×

రోడ్ల మంత్రి జె.సి. దివాకరరెడ్డి 3 తేది మద్రాసు నుంచి ఒంగోలుకు వెళ్తూ కొద్దిసేపు గెస్టుహౌస్‌లో విశ్రాంతి తీసుకున్నారు.

× × ×

స్త్రీ శిశు సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి కుతూహలమ్మ 3 తేది ఉదయం తిరుపతి నుంచి నెల్లూరు వచ్చి, సాయంత్రం వరకు గెస్టుహౌస్ లో గడిపి, హైదరాబాదెక్స్‌ప్రెస్ ఎక్కారు.

### ఉచితదంత వైద్యశిబిరం

లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో 15 తేది ఉదయం 9 గంటల నుండి ఒంటి గంట వరకూ డాక్టర్ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి ఓ.పి. హాలులో ఉచిత దంత వైద్యశిబిరం నిర్వహించ బడుతుంది. హైదరాబాదు దంత వైద్యశాల డాక్టర్లు పి. రామచంద్రారెడ్డి, జయకుమార్, నిరంజన్ సింగ్ యాదవ్, బి.కె.రెడ్డి ప్రభృతులు పరీక్షించి పుచ్చిన పళ్ళు, పళ్ళు తీసివేయడం, చిన్న ఆపరేషన్లు కూడా చేయబడును.

ప్రప్రథమంగా నెల్లూరులో విస్తృతంగా జరుగు తున్న ఈ శిబిరం సేవలను ఉపయోగించు కోవలసిందిగా క్లబ్ డెంటల్ కేర్ ఛైర్మెన్, విఖ్యాత దంత వైద్యులు డాక్టర్ జి. కొండారెడ్డి గారు విజ్ఞప్తి చేస్తున్నారు.

### న్యాయవాదులు – జె.కె. జోక్యం !

మెజిస్ట్రేట్ కోర్టులో పోలీసుల దౌర్జన్యం పట్ల నిరసనగా నెల్లూరు న్యాయవాదులు నిర్వహిస్తున్న ఉద్యమాన్ని నివారించడానికి శాసన సభ్యుడు శ్రీ జెకెరెడ్డి జోక్యం చేసుకొని రాజీ ప్రయత్నం చేస్తున్నాడు. ముందుగా న్యాయవాదులను కలిసి వారి వాదన విని, పోలీసు సంఘానికి నివేదించాడట. పోలీసులతో చర్చలు జరపడానికి ఎస్పి శ్రీ భూపతి బాబు టౌన్‌లో లేరు. ఆయన బహుశా రేపు (7 తేది) రావచ్చు. ఆ తర్వాత రెండు వర్గాలను ఒక చోట చేర్చి సంప్రతింపులు జరుపుతారట.

న్యాయవాదులు మాత్రం తమ మానాన తమ ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారు. ఈ రోజు (6 తేది) ఉదయం నుంచి కోర్టు ఆవరణంలో రిలే నిరాహార దీక్షలు కూడా ప్రారంభించారు. జిల్లా మొత్తం మీద ఒక్క కోర్టుకూడా పనిచేయడం లేదు.

### గ్రామాధికారులు

తెలుగు దేశం నేత ఎన్‌టిరామారావు పుణ్యమా అని వీధుల పాలైన గ్రామాధికారులకు ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి ఉద్యోగ భిక్ష పెట్టాడు. ఏడేళ్ల పాటు జరిపిన వారి ఉద్యమం ఇన్నాళ్లకు ఫలితాన్నిచ్చింది. రేపు జనవరి 26 తేది నుంచి ఎన్టీ ఆర్‌ఊడగొట్టిన గ్రామాధికారులందరూ తిరిగి అదే ఉద్యోగాలలో నియమితులౌతున్నారు.

గ్రామాధికారులకు పునః నియామకపుటుత్తర్వులు ఇచ్చేందుకు నెల్లూరు జిల్లాను 786 గ్రూపులుగా విభజించారు. మొత్తం పదకొండువందల చిల్లర గ్రామాలను ఈ గ్రూపులలోకిచేర్చారు. 7 తరగతి ఆపైన విద్యార్హత కల్గిన, మునసబు, కరణం పరీక్షలు పాసైనవారికి, 58 ఏళ్ల లోపు వయస్సు వుంటే తిరిగి ఉద్యోగం లభిస్తుంది. నెలకు 600 రూపాయల జీతంఇస్తారు. బదలీలు వుండవు. వంశపారంపర్యపు హక్కు కూడా వుండదు. సుప్రీంకోర్టు నిర్ణయాన్ని అనుసరించి ఇప్పటికే విలేజి అసిస్టెంట్లుగా నియమితులై వున్న మాజీ గ్రామాధికారులు కావాలనుకుంటే ఈ ఉద్యోగాలలోకి రావచ్చు లేదా అక్కడే కొనసాగవచ్చు. వారిని జూనియర్ అసిస్టెంట్లుగా రెవిన్యూశాఖలో ఏర్పడే ఖాళీలలో నియమిస్తారు. పునః నియామకాలు జరిగేవారికి ఈ అవకాశం వుండదు.

డిసెంబరు 25 తేది నుంచి దరఖాస్తు లు తీసుకొని, జనవరి 26 తేదిలోగా నియామకపుటుత్తర్వులు ఇవ్వాలని ప్రభుత్వ ఆదేశం. జిల్లాలో దాదాపు వెయ్యిమంది అర్హులైన గ్రామాధికారులు లభ్యమౌతారని అంచనా. ఇప్పుడు కూడా ఉద్యోగం తిరిగి పొందలేనివారు నిజంగా దురదృష్ట జాతకుల క్రిందే లెక్క.

వేలాది కుటుంబాలలో ఉద్యోగ దీపం వెలిగించి, దారిద్ర్యం నుంచి తప్పించిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి గారికి జేజేలు చెప్పాలి !

### రిటైర్మెంట్

రెవిన్యూ ఉద్యోగంలో వుంటూనే చరిత్ర పరిశోధనపై మక్కువ పెంచుకొని రచయితగా మారిన ఆత్మకూరు ఎంఆర్‌ఓ శ్రీ వావిలపల్లి కృష్ణారావు మొన్న 30 తేది రిటైరైపోయారు. జమీన్ రైతులో 'ఊరుపేరు' శీర్షిక క్రింద పలుగ్రామాల పేర్లపై వ్యాసాలు వ్రాసారు కృష్ణారావు. చరిత్ర పరిశోధనకు ఇకనుంచి కావలసినంత సమయం దొరుకుతుంది.

### అడిషనల్ ఎస్పి

నెల్లూరు జిల్లా అడిషనల్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసుగా శ్రీ గోపాలకృష్ణ చార్జితీసుకున్నారు. శ్రీ లక్ష్మణమోహన్ బదలీ తర్వాత చాలాకాలం నుంచి ఖాళీగా వుండింది పదవి.

### మరణాలు

రిటైర్డ్‌డిప్యూటి కలెక్టరు శ్రీ టి. పద్మనాభదాస్ (59) మూత్ర పిండాల వ్యాధితో నవంబరు 29 తేది మరణించారు.

శ్రీ దాస్ నెల్లూరు కలెక్టర్ ఆఫీసులో హుజూర్ తాసిల్దారుగా, నెల్లూరు నాశమ్మారు పేటలలో తాసిల్దారుగా, నెల్లూరు చక్కెర ఫ్యాక్టరి మేనేజరుగా, తెలుగు గంగ స్పెషల్ డిప్యూటి కలెక్టరుగా పనిచేశాడు. ఉద్యోగకాలం ఆద్యంతం శ్రీ దాస్ నిప్పులాంటి నిజాయితీ పరుడని పించుకున్నాడు. దాస్ స్వస్థానం వెంకటగిరి.

ఆయనకు భార్య, ఒక కుమారుడు, ఒక కుమార్తెవున్నారు.

× × ×

నెల్లూరు రిటైర్డ్ డిప్యూటి ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ శ్రీ గ్రిద్దలూరు శివ శంకరరావు కుమారుడు, బి.టెక్. పట్టాపొంది హైదరాబాదులో ఒక ప్రయివేటు కంపెనీలో పనిచేస్తుండిన శ్రీ అనంతనారాయణరావు (26) నవంబరు 26 తేది రాత్రి స్కూటర్ ప్రమాదంలో దారుణమైన మరణానికి గురియైనాడు. వికసిస్తున్న కుసుమాన్ని నిర్దయగా తుంచివేశాడు పాపిష్టి దైవం.

అనంతనారాయణ రావు అవివాహితుడు. ఆయువకుడు కంపెనీ తరఫున ఒకసారి దక్షిణాఫ్రికాకు పోయి వచ్చాడని, మరోసారి విదేశాలకు పోనుండినాడని తెలిసినది.

× × ×

ఇనమడుగు జూనియర్ కాలేజి ప్రదాత, మర్యాద మన్నన కల్గిన రైతు, విద్యాభిమాని శ్రీ నల్లపరెడ్డి వెంకట కృష్ణారెడ్డి 6 తేది ఉదయం మరణించారు. 87 సంవత్సరాల పరిపూర్ణ జీవితం గడిపాడాయన. చెప్పుకోదగ్గ సంపద లేక పోయినా, 75 వేలు విలువచేసే భూమి, 25 వేలు విరాళం ఇచ్చి కాలేజి స్థాపనకు కారకుడైనాడు.

పై కుటుంబాలవారికి మా సానుభూతి.









స్మృత్యంజలి



అమరజీవి
కూరపాటిరామచంద్రారెడ్డిగారు
సంస్మరణ 6.12.91 తేది
మిమ్మల్ని ఎన్నటికీ మరచిపోలేని
సోదరీమణులు
శ్రీమతి ఈదూరు కమలమ్మ
డాక్టర్ కె. రాజమ్మ B.A., M.D., D.C.H
రిటైర్డ్ సివిల్ సర్జన్ – నెల్లూరు ఫోన్ :25737
మేనల్లుడు
డాక్టర్ ఐ.వి. రఘునాధ రెడ్డి ఎం.డి.యస్.,
డెంటల్ సర్జన్

# తెలుగుగంగ రైతుల నోట అధికారులు మట్టికొట్టారు!

తెలుగు గంగ రైతుల నోట అధికారులు మట్టికొట్టారు. దానిమ్మ చెట్ల నష్ట పరిహారం క్రింద ఎకరాకు నలభై ఐదు వేల రూపాయిల వంతున చెల్లించాలని ముఖ్యమంత్రి చేసిన ఉత్తర్వు అమలు చేయడానికి తిరస్కరించారు.

కండ్లేరు మునక భూములలో దానిమ్మ చెట్లు పెంచి అధిక మొత్తంలో పరిహారం రాబట్టడానికి జరిగిన ప్రయత్నం తెలిసిందే. తెలివైన వ్యాపారులు దానిమ్మ చెట్లను కనిపెట్టి అధికారులను బుట్టలో వేసుకొని మొదట మొదట కోట్లు అందుతుందన్న ఆశతో తమ పొలాలలోనూ దానిమ్మ తోటలు పెంచారు. అయితే అప్పటికే రచ్చ జరిగిపోవడంతో రైతులెవరికీ చిల్లి గవ్వ ముట్టలేదు. ఇళ్ళలో వున్నదంతా వూడ్చి నగలూ, గిగలూ తెగనమ్మి చెట్లకు పెట్టిన పెట్టుబడి దండగై పోయింది. దీనిపై రైతులు పెద్ద ఎత్తున ఆందోళన చేసారు. వచ్చిన ప్రతి అధికారికి, మంత్రికి మొరపెట్టుకున్నారు. లోక్ అదాలత్‌లకు విన్నవించారు. ఏడాదిన్నర అలజడి తర్వాత ప్రభుత్వం ఎకరాకు నలభై ఐదు వేల

## చేపల రైతుల విద్యుత్ చార్జి తగ్గింపు ఫైలుకూ అదే దుర్గతి!

సంపాదించేసారు. అప్పట్లో ఎకరాకు మూడు లక్షల ఏభై వేల వంతున పరిహారం చెల్లించింది ప్రభుత్వం అయితే ఇది పట్టపగలు దోపిడీ అని ఆగం కావడంతో కలెక్టరు కె.రాజు వ్యక్తిగత చొరవతో పంపకం ఆగిపోయింది. దీనిపై దర్యాప్తులు విచారణలు, సభా సంఘాలు, కోర్టు కేసులు సస్పెన్షన్లు వగైరాలన్ని జరిగిపోయాయి.

తమ గ్రామాలకు వలస వచ్చిన వ్యాపారులు తమ కళ్ళ ఎదుటే లక్షలులక్షలు దోచుకోవడం చూసిన రైతులు అదే సొమ్ము తమకూ రూపాయిల వంతున పరిహారం చెల్లించడానికి సమ్మతించింది. వచ్చే వాడి పెళ్ళికి వచ్చినంత లాభం అనుకొని రైతులు సంతృప్తి పడ్డారు. కానీ ఇప్పుడు ఆ ఆశ కూడా లేకుండా పోయింది. నలభై ఐదు వేల పరిహారం ఇవ్వాలని ముఖ్యమంత్రి మూడు సార్లు ఉత్తర్వులు వేస్తే మూడు సార్లూ ఫైల్లను వెనక్కి త్రిప్పి పంపారు సెక్రెటరీలు. దానిమ్మ తోటలనేవి కండ్లేరు ప్రాంతంలో లేవు కాబట్టి కేవలం పరిహారం కోసం వేసిన తోటలు కాబట్టి ఇవ్వవల్సిన అవసరం లేదన్నది అధికారుల వాదన. దానిమ్మ తోటలు ఎందుకు వేసింది అందరికీ తెలుసు. అధికారులు ఈ రోజ కొత్తగా కనిపెట్టిన విషయం కాదది. ఆ సంగతి ముఖ్యమంత్రికి తెలుసు. అందువల్లే మొదట మూడులక్షలా ఏభై వేలు ఇచ్చినా, రైతులకు, అన్యాయం జరుగుతున్నదని తెలిసినా, కనీసం రైతులు నష్ట పోకూడదనే ఉద్దేశంతో నిర్ణయించిన మొత్తం ఇది. దానినీ అధికారులు తిరస్కరించారంటే ఇక ఆ రైతుల గతేమిటి

ముఖ్యమంత్రి ఉత్తర్వు చిత్తు పతుల క్రింద అధికారులు బుట్టలో వేయడం ఇది మొదటిసారి కాదు. గతంలో చేపల రైతులకు విద్యుత్ చార్జీల నిర్ణయంలోనూ ఇదే జరిగింది. విద్యుత్ రేట్లలో సగం సబ్సిడీ ఇస్తామని ముఖ్యమంత్రి బహిరంగంగా ప్రకటించాడు. రేపే ఉత్తర్వు వచ్చేస్తున్నదని చెప్పారు. ఆరు నెలలు గడిచినా అతి గతి లేదు. ముఖ్యమంత్రి ప్రతిపాదనను విద్యుత్ బోర్డు అధికారులు తిరస్కరించారని వినికిడి. ఎవరికీ ఏమీ ఇవ్వకుండా, ఎవరితోనూ ఏ మాటా చెప్పకుండా అసెంబ్లీలో కూర్చొని ఐదు హార్సు పవర్ వరకు బిల్లు కట్టనవసరం లేదని అనాటి ముఖ్యమంత్రి చెప్పిన మాటను ప్రక్క రోజు తెరిగేసరికల్లా అమలు చేసిన విద్యుత్ బోర్డు ముఖ్యమంత్రి వ్రాత మూలకంగా వేసిన ఉత్తర్వును ఎందుకు అమలు చేయడం లేదు? ఈ రాష్ట్రాన్ని పరిపాలించేది అధికారులా? ప్రజా ప్రతినిధులా? మంత్రులు, ముఖ్యమంత్రులను గడ్డిపోచ క్రింద జమకట్టి తమ ఇష్టారాజ్యంగా వారు పరిపాలించేటప్పుడు ఇక మరొకరెందుకు? ఎమ్మెల్యేలు ఎందుకు? ప్రభుత్వాలెందుకు? ఏమిటీ పరిస్థితి!

## హయగ్రీవాచారి దారుణ హత్య

సీనియర్ కాంగ్రెస్ నాయకుడు, మాజీమంత్రి శ్రీ హయగ్రీవాచారిని 5 తేది ఉదయం వరంగల్లులో నక్సలైట్లు దారుణంగా కాల్చిచంపారు. సైకిళ్లపై వచ్చి ఇంట్లోకిప్రవేశించి, పేపరు చదువుతుండిన ఆయన కణతపై పిస్తోలు ఆనించి, కాల్చి, చంపి, తీరికగా తిరిగి వెళ్లిపోయారు.

ప్రభుత్వం ఇప్పటికైనా కళ్లు తెరుస్తుందా?

## పంచాంగం

### ముహూర్తములు

తేది 9 సోమవారము పగలు గంట 11.44 లకు కుంభలగ్నమున గృహారంభ ఉపనయన వ్యాపారా రంభములకు

తేది 11 బుధవారము రాత్రి గంట 11.50లకు సింహలగ్నమున వివాహ గృహప్రవేశములకు

తేది 12 గురువారము పగలు గంట 11.40 లకు కుంభలగ్నమున గృహారంభ, ఉపనయన, వివాహ, వ్యాపార ప్రారంభములకు

రాత్రి గంట 11.44 లకు సింహలగ్నమున గృహప్రవేశ వివాహములకు సుముహూర్తములు కలవు.

### డిసెంబర్ తిధులు

మార్గశిర్ష శుధ

తేది 7 శని పాడ్యమి ఉదయం గంట 9.50 వరకు
తేది 8 ఆది విదియ పగలు గంట 11.34 వరకు
తేది 9 సోమ తదియ పగలు గంట 1.40 వరకు
తేది 10 మంగళ చతుర్థి పగలు గంట 3.50 వరకు
తేది 11 బుధ పంచమి రాత్రి గంట 6.00 వరకు
తేది 12 గురు షష్ఠి రాత్రి గంట 7.55 వరకు
తేది 13 శుక్ర సప్తమి రాత్రి గంట 9.30 వరకు

—స్వయం పాకం శ్రీనివాసులు ఎం.ఎ.

## సిఫార్సు

(మొదటి పేజీ కొరవ)

పుట్టపర్తికి వెళ్ళినప్పుడు సత్యసాయిబాబా ముఖ్యమంత్రిని పక్కకు పిల్చి, నటరాజన్‌కు పదవీకాలం పొడిగించమని సిఫార్సు చేసాడని వినికిడి. సాయిబాబా పై కొత్తగా భక్తి ప్రపత్తులు పెంచుకొన్న జనార్ధన రెడ్డిగారు కాదనలేక పోయారని చెప్తున్నారు. నీతి నిజాయితీలకు సర్వీసంతా పేరు తెచ్చుకున్న నటరాజన్ ఆఖరి దశలో ఎందుకు రాజీ పడ్డాడో, ఎవరి సిఫార్సులనూ లెక్క చేయని అధికారి ఈ దశలో తన కోసం ఇంకొకరి చేత ఎందుకు సిఫార్సు చేయించుకున్నాడో తెలియదు.

## బహిరంగవేలం

కాలపరిమితి గడచినప్పటికి విడిపించని వస్తువులు :-

1) యస్. ప్రకాష్ కుమార్, పాన్ బ్రోకర్ పి.బి.యల్ నెం. 4 /86 , 8 /46 (3) బజారు వీది వి. కోటవారి తాలూకూ కాలపరిమితి గడిచినప్పటికి 17.10.89 నుండి 30.9.90 తేది వరకూ గల విడిపించని వస్తువులు 15.12.91 తేది వుదయం 10 గం।ల నుండి 8 /46 (3) బజారువీది వి. కోట, చిత్తూరు జిల్లాలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) హెచ్. అంబాలా ఫైనాన్షియర్స్, పి.బి.యల్ నెం. 2/ 83 రు. 6 - 22 - A2 బజారు వీది , వి.కోటవారి తాలూకూ కాలపరిమితి గడచినప్పటికి 4.7.89 నుండి 2.7.90 తేది వరకు విడిపించని వస్తువులు 16.12.91 తేది 10 గంటల నుండి 6/22 -A 2 వి. కోటలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) ప్రకాష్ అండ్ కో పాన్ బ్రోకర్సు పి.బియల్ నెం. 99 రు 8.1.50 బజారువీది, తిరుపతి వారి తాలూకూ కాలపరిమితి గడచినప్పటికి 8.1.90 నుండి 27.9.90 వరకు గల విడిపించని వస్తువులు 20.12.91 తేది ఉదయం 10 గంటలనుండి 8.1.50 బజారువీది, తిరుపతి లో బహిరంగముగా వేలము జరుపబడును.

4) యం.ఆర్. శ్రీనివాసులు శెట్టి అండ్ సన్ పి.బియల్ . నెం. 9 /72, 12 / 133, పడమర గమళ్ళపాళెం,గూడూరు వారి తాలూకూ కాలపరిమితి గడచినప్పటికి 31.08.82 నుండి 22.04.86 వరకు గల విడిపించని వస్తువులు సుమారు 9 అయిటములు 21.12.91 తేది ఉదయం 10 గంటల నుండి 12/ 133, పడమటి గమాళ్ళ వీధి, గూడూరులో బహిరంగముగా వేలముజరుపబడును.

5) శ్రీ పవన్ కృష్ణా అండ్ కో పాన్ బ్రోకర్సు పి.బి.యల్ నెం. 16/ 86 - 87, 13- 577 /2 కాకర్లవారివీది, నెల్లూరు వారి తాలూకూ కాలపరిమితి గడచినప్పటికీ 30.07.88 నుండి 15.11.89 వరకూ గల విడిపించని వస్తువులు షుమారు 6 అయిటములు 24.12.91 తేది ఉదయం 10 గంటల నుండి 13/577-2, కాకర్లవారి వీది, నెల్లూరు, నందు బహిరంగముగా వేలము జరుపబడును.

6) మూలా శోభాగ్‌మల్ సన్స్, పాన్ బ్రోకర్స్ పి.బియల్ . నెం. 3 / 84 -85 . 17.6.15 టి.పి.రాముడు వీది, చిత్తూరు వారితాలూకూ కాలపరిమితి గడచినప్పటికి 5.4.90 నుండి 27.12.90 తేది వరకు గలవిడిపించని వస్తువులు మూలా శోభాగ్‌మల్‌సన్స్ మెయిన్‌రోడ్డు, పాకాలలో 5.1.92 తేది ఉదయం 10 గంటల నుండి బహిరంగముగా వేలము జరుపబడను.

7) శేట్ రక్పాజీరూమాజీ అండ్ పాన్ బ్రోకర్స్ పి.బియల్ . నెం. 2826/64 , రు 13/ 351 , ఆచారివీది నెల్లూరు వారి తాలూకు కాల పరిమితి దాటినప్పటికి 18.3.86 నుండి 25.12.89 వరకు గల విడిపించని వస్తువులు షుమారు 17 అయిటములు · 19.12.91 తేది ఉదయం 10 గంటల నుండి 13/357, ఆచారి వీది , నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

8) శేట్ రాయ్‌చంద్ ఖిలామాజీ అండ్ కో పాన్ బ్రోకర్సు పి.బియల్ నెం 12/74-75 రు. 13/351, ఆచారివీది, నెల్లూరు వారితాలూకూ కాలపరిమితి గడచినప్పటికి 25.2.87 నుండి 29.12.89 తేది వరకూ గల 9.1.90 తేది వరకూ గల విడిపించని వస్తువులు సుమారు 20 అయిటములు 19.12.91 తేది మధ్యాహ్నం 2 గంటలనుండి 13/ 351, ఆచారి వీది, నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడను.

కె.వి. రామకృష్ణారావు

ప్రభుత్వంనియమించిన

తరువున ఒకసారి దక్షిణాఫ్రికాకు పోయి వచ్చాడని, మరోసారి విదేశాలకు పోనుండినాడని తెలిసినది.

తెట్టంత తనయుని కోల్పోయిన అనంతనారాయణరావు తల్లి దండ్రులకు, మంచి పేరుతో వుద్యోగ విరమణ చేసిన దివంగతుడైన పద్మనాభరాజు కుటుంబానికి మా సానుభూతి తెలియచేస్తున్నాము.

సినిమా సినిమా సినిమా

# చిరంజీవి ఇంగ్లీషు చిత్రనటుడౌతాడా ?

నటుడు సత్యనారాయణ సమర్పణలో ఆయన తమ్ముడు కె. నాగేశ్వరరావు నిర్మించిన ''కొదమ సింహం'' చిత్రం ఆంగ్లంలో డబ్ చేయబడింది. పేరు ''హంటర్స్ ఆఫ్ ది ఇండియన్ ట్రెజర్'' రెండున్నర గంటల ప్రదర్శన కాలమైన తెలుగు చిత్రం ఆంగ్లంలో 100 నిమిషాలకు కుదించబడింది. అంతర్జాతీయ మార్కెట్‌లో ఈ చిత్రం విజయవంతమైతే, చిరంజీవి ఒక ఆంగ్ల చిత్రంలో నటించే అవకాశం లేకపోలేదు.

## చంద్రమోహన్ కుమార్తె వివాహం

నటుడు చంద్రమోహన్, రచయిత్రి జలంధరల జ్యేష్ఠ కుమార్తె మధుర మీనాక్షికి హైదరాబాద్‌కు చెందిన ఎ. రామ్మోహన్‌తో నవంబరు 24 ఉదయం మద్రాసు పామ్‌గ్రోవ్ హోటల్లో వైభవోపేతంగా వివాహం జరిగింది. చలన చిత్ర పరిశ్రమకు చెందిన ప్రముఖులనేకులు విచ్చేసి, వధూవరులను ఆశీర్వదించారు.

## మాధవిని తొలగించిన హేమమాలిని

**మా మద్రాసు విలేఖరి**

''దిల్ ఆష్నా హై'' అనే హిందీ చిత్రాన్ని హేమమాలిని నిర్మిస్తోంది. అందులో నాయికగా మాధవిని బుక్ చేసింది. కాని, అమెరికాలో ఏదో ప్రోగ్రాంలో పాల్గొనడానికి మాధవి అర్జంట్‌గా వెళ్ళి వచ్చి, కాల్ షీట్లు సర్దుబాటు చేస్తానంది. హేమ ఒప్పుకోలేదు. మాధవి పెడచెవిని పెట్టి విమానంలో తుర్రుమంది. ఆగ్రహం చెందిన హేమ వెంటనే అమితాసింగ్‌ను బుక్ చేసి, షూటింగ్ నిరాటంకంగా కొనసాగిస్తోంది. ''ఏ నటైనా తన వృత్తి పట్ల ధ్యాస ఉండాలి. విదేశాలకు వెళ్ళడానికి తన వృత్తిని నిర్లక్ష్యం చేస్తే ఎలా ? ఆమె కోసం నేను ఇతరుల డేట్స్‌ను వృథా చేసుకోనా ? అందుకే ఆమెను తొలగించాను.'' అంది. కాల్‌షీట్ల విషయంలో హేమ ఎంతో స్ట్రిక్ట్‌గా ఉంటుందన్న విషయం చాలా మందికి తెలుసు. కాని, మాధవి ''ఆమె చిత్రంలో నాకు ఒక వేషం పోయినందువల్ల కొంపమునిగేదేమి లేదు. విదేశాలకు వెళ్ళే అవకాశం ఎప్పుడో గాని రాదు,'' అందట. మామూలుగా సిగరెట్ తాగే అమృతా సింగ్, డింపుల్ కపాడియా, సోనువాలియా లాంటి తారలు సైతం హేమమాలిని ఎదుట పొగపీల్చడానికి భయపడతారు. హేమ సెట్‌లో ఉంటే పనులు చకచక సాగిపోతాయి. అలాంటి హేమ చిత్రంలో చక్కని వేషం పోగొట్టుకున్నందుకు మాధవి బాధపడకపోవడం ఆశ్చర్యమే మరి.

కొరవ 10 పేజీలో

# దర్శకుడి ప్రతిభకు అద్దం పట్టింది యుగళగీతం

**చిత్రసమీక్ష**
★★★★★
**గిద్దలూరు గోపాలరావు**

''యుగళగీతం'' ఒక మంచి చిత్రం. సందేహం లేదు. ఈ చిత్ర దర్శకుడు గొప్ప భావకుడు. కృషి మీద ఆరాధన, అభిమానము ఇంతటి భావకతను అలరించాయి. ఇందులో అసత్యదోషం లేదు. ఈ దర్శకునిలో అనుభూతి ఎంత గాఢమో, ఆవేశం అంత గూఢం. ఈయన దర్శకత్వంలో విలక్షణమైన బాణీ వుంది. విశిష్టమైన దృక్పథం వుంది. ఇంతకూ ఈ దర్శకుడు ఎవరనే ప్రశ్న ఎదురుకాక ముందే ఎవరైందీ చెప్తున్నాను.

ఇతను నిన్న మొన్నటి వరకు పూనా ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన యువకుడు ఫణీసుందర్. అభ్యాస బలంతో, ఇతనిలో ఎగిసే ఊహల్ని ఆకర్షణీయమైన లక్షణాలతో దృశ్యాల్లో బిగించి ప్రేక్షకులను ఆకట్టుకునే నేర్పరితనం బలీయంగా వుంది. దీనికంతా నిదర్శనం ''యుగళగీతం''.

సినిమా జీవన ప్రయాణంలో దర్శకుడుగా ఫణీసుందర్ పాదం మోపిన తొలి మెట్టు ''యుగళగీతం''. ఇతనికి ఈ చిత్రం మంచి పేరు ప్రఖ్యాతులు తెస్తుంది. ఈ చిత్రం కాలూకూ కథ ఒక ప్రేమ కథ. ప్రేమికుల ప్రేమను ఫలించనీయకుండా చేసి ప్రేమనూ, ఆస్తిని అపహరించాలనుకున్న ఒక దుర్మార్గుని ఉపకథ కూడా ఇందులో వుంది.

హరి (హరీష్). హేమ (కొత్త ముఖం, హేమమాధుర్) కాలేజీలో చదువుతూ ప్రేమించుకుంటారు. హరి మేధావంతుడు. హేమ శ్రీమంతురాలు. ఈమెకు తల్లిదండ్రులు లేరు. ఈమె అంకుల్ జె.కె.రావు ( వల్లభనేని జనార్ధన్ ) ఈమెకు, ఈమె ఆస్తిపాస్తులకు గార్డియనుగా వుంటాడు. హరితో కాకుండా మరో అనామకుడితో హేమ పెళ్ళి జరిపించి ఈమెను, ఈమె ఆస్తిని తన గుప్పిట్లో వుంచుకోయత్నిస్తాడు. అంకుల్ పన్నిన కుట్రను హేమ ఎదుర్కొంటుంది. మోటరు మెకానిక్‌గావున్న జైరాజ్ (శరత్‌బాబు) ప్రేరణతో హరి రంగంలోకి దూకి అంకుల్ వగైరా దుర్మార్గులకు కాయశుద్ధిచేస్తాడు. హరి, హేమలు ఇద్దరూ మధుర యుగళగీతమౌతారు. జీవనగీతం ఆలాపన ఆరంభిస్తారు. కథా వస్తువు చాలా పాతది. ఇది వరకు చాలా చిత్రాల్లో చూచిందే. ఈ పాత కథను దర్శకుడు కొత్త దృష్టితో చూడగలిగాడు. తనదైన స్పందన పొందగలిగాడు. ప్రేక్షకులను, ముఖ్యంగా యువకులను ఆకర్షించగలిగాడు. ఇది ''గేమ్ ఆఫ్ ఛాన్సా లేక గేమ్ ఆఫ్ స్కిల్లా'' అనే విషయం ఇతని రెండవ చిత్రం

కొరవ 10 పేజీలో





చెంగల్వపూదండ చిత్రంలో అజయ్, మీనా

# భానుమతి ఇంకా నటిస్తూనే వుంది !

ఈ వయస్సులోనూ డాక్టర్ భానుమతీ రామకృష్ణ బిజీగానే ఉన్నారు. ఎన్.టి.ఆర్. దర్శకత్వంలో ''సామ్రాట్ అశోక్''లో అంధురాలి పాత్రను తొలిసారిగా పోషించి వచ్చిన వెంటనే శ్రీ సాయిప్రసన్న కంబైన్స్ చిత్రంలో నటిస్తున్నారు. ''తొలిసారిగా ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం పరుచూరి సోదరుల రచన నిర్వహించే చిత్రంలో నటిస్తున్నందుకు ఎంతో ఆనందంగా ఉంది'' అన్నారామె. ఈ చిత్రంలో రాజశేఖర్ హీరో. మీన, కోట శ్రీనివాస రావు, బాబూ మోహన్, బబిత, కృష్ణవేణి, కల్పనారాయ్ ఇతర పాత్రధారలు. సంగీతం: ఇళయరాజ. నిర్మాత. బి. బులి సుబ్బారావు.

## చిరంజీవి హిందీ చిత్రం

"ప్రతిబంధ్" అనంతరం చిరంజీవి నటిస్తున్న ద్వితీయ హిందీ చిత్రం ''గూండారాజ్'' రవిరాజా పినిశెట్టి దర్శకత్వంలో సగం పైగా పూర్తయింది. మీనాక్షి శేషాద్రి నాయిక. రాజ్‌బబ్బర్, ప్రేమ్ చోప్రా, టీనూ ఆనంద్, గీత, పరీక్షిత్ సాహ్నీ ఇతర పాత్రధారులు. నిర్మాత. ఎన్.ఎన్. సిప్పి.

## ఎం.ఎస్. రెడ్డి డబ్బింగ్, ప్రివ్యూ థియేటర్లు

మన రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి సహజకవి మల్లెమాల సుందరరామిరెడ్డి ఎంతగానో కృషి చేస్తున్నారనే విషయం సర్వవిదితమే. బంజారా హిల్స్‌లో ప్రసాద్ లేబరేటరీ ఎదురుగా ఉన్న ఈయన స్వంత స్థలంలో డబ్బింగ్, ప్రివ్యూ థియేటర్లు నిర్మిస్తున్నారు. ఆ థియేటర్ల క్రింద కార్యాలయం ఉంటుంది.

## డాక్టరుగా గౌతమి

తెలుగు పడుచు గౌతమి తమిళ చిత్రాలలో విభిన్న పాత్రలు ధరిస్తూ, ఎంతో బిజీగా ఉంది. ఈమె తండ్రి పేరు మోసిన డాక్టరు ; తల్లి కూడా డాక్టరే. ఒక తమిళ చిత్రంలో గౌతమి డాక్టర్‌గా నటిస్తోంది. ''ఈ పాత్రను ఎవరైనా వేయవచ్చు. కాని, పేషంట్‌కు ఏ వైపున నుంచి, స్టెతస్కోప్‌ను ఎలా ఉపయోగించాలో నాకు తెలిసినంతగా మరెవ్వరికీ తెలీదని చెప్పగలను. మా అమ్మా నాన్నల మూలంగా వైద్యవృత్తికి సంబంధించిన ఎన్నో విషయాలు తెలుసుకొన్నాను.'' అంది ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్ చదివిన ఈ విశాఖపట్నం వనిత.

# ఎయిడ్స్

4వ పేజీకొరవ

దేశాలన్నీ ఆందోళనతో అట్టుడుకుతున్నాయి. పుకార్లు కూడా పుట్ట గొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి. ఒకరిద్దరు ప్రముఖ సినీ నటులు నిజంగానే ఈ వ్యాధి కారణంగా మరణించినా, అనేక మందికి దీన్ని ఆపాదించి, సంపాదించు కుంటున్నాయి అక్కడి సినీ పత్రికలు ప్రజల్లోని అపోహలు తొలగించడం కోసం, ధైర్యం అందివ్వడం కోసం, T.V. ల ద్వారా, రేడియోల ద్వారా, ప్రత్యేక మెడికల్ బులెటిన్‌ల ద్వారా కరపత్రాల ద్వారా ఆయాదేశ వైద్య సంస్థలు ప్రభుత్వ సమాచార శాఖలకు వాస్తవాల్ని అందించి ప్రజలకు తెలియ పరుస్తున్నాయి. స్వచ్ఛంద సంస్థలు కూడా తమ వంతు విధిని అవి నిర్వర్తిస్తూనే వున్నాయి.

ఈ ఎయిడ్స్ దాకకు గల కారణాలను అనేకులు అనేక విధాలుగా తమ అభిప్రాయాలను వెలి బుచ్చుతున్నారు. తొట్ట తొలుత 1860 లో సెంట్రల్ ఆఫ్రికాలోని అనాగరిక జాతుల్లోని వృద్ధుల్లో వుండినదని అదిన్నీ ఓ ఆకుపచ్చ రంగుగల కోతుల ద్వారా వారికి సోకిందని, అప్పట్లో ఆదేశంలో ఆ వ్యాధికి 'ఆఫ్రికన్ స్వైన్ ఫీవర్' అనే పేరుండేదని. పిమ్మట కొన్ని దశాబ్దాలకు, మెడిటరేనియన్ దీవుల్లో నివసిస్తుండిన ప్రజలకు సోకిందని, అటుపై హైతీ ప్రాంత ప్రజలకు దాకిందనీ కడకు సంయుక్త రాష్ట్రాల జనాల్లోకి ప్రాకిందని ఓ ప్రతి పాదన. T. సెల్‌లింఫోట్రోఫిక్ వైరస్ III లేదా (HIV) అనే సూక్ష్మ జీవి ఈ భూతానికి కారణ భూతమని, ఆ వైరస్ క్రిమి దేహమందలి సహజ రక్షక యంత్రాగాన్ని నిర్వీర్యంజేసి, అందుకు దోహద పడే తెల్ల కణాలను ధ్వంసం చేసి వ్యాధి నిరోధక శక్తిని హరించి, వేస్తుందని ఒక వూహ. డాక్టర్ 'గోటెలెట్' అనే శాస్త్రవేత్త సైటో మెగాలో వైరస్ అనే సూక్ష్మ క్రిమి ఈ వ్యాధికి కారణమంటాడు. ఏ దేని దీర్ఘ కాల వ్యాధుల వల్ల. ఆ వ్యాధుల్లో అనేక దినాలు వాడిన మందుల వల్ల, ఇలా ఏ కారణంగా నైనా కాసింత సహజ రక్షణ యంత్రాంగం సన్నగిల్లియున్న వారినే ముందుగా ఈ వ్యాధి ప్రేమిస్తుందని ఆయన భావం. ఏది ఏమైనా ఇది అంటు రోగమే గానీ. అలెర్జీ లాంటి వ్యాధి కాదు. అంటు రోగమే అయినా సుఖవ్యాధులంతటి వాటంత త్వరగా అగుపించేదిగాదు. తీవ్రమైన అంటు వ్యాధిగాదు. అంటే అంత తేలికగా అంటుకునేది కాదు. అనేక ఆధునిక అభివృద్ధి విధానాలు, ఆర్థిక సుస్థిరత అడ్వాన్సుడు టెక్నాలజీ, పారిశ్రామిక ప్రగతి, ఆధునిక అభివృద్ధి విధానాలు అన్ని రంగాల్లోనూ సాంకేతిక నిపుణతలతో బాటు, మితి మీరిన హద్దులు దాటిన, అదుపు దప్పిన, శృంగార విశృంఖలానికి, విచ్చలవిడి తనానికి, పరమ మిక్కుటమైన మాదక మందుల వినియోగానికి, స్వలింగ సంపర్కం లాంటి, ఇతరత్రా గల వింత, విచిత్ర, విన్నూత్న శృంగార లీలా ప్రయోగాలకు కూడా ఈ భూగోళంలో అమెరికాలోని సంయుక్త రాష్ట్రాలే అగ్రగామి గా ప్రఖ్యాతి గాంచి యున్నాయి. ఇలా కొజ్జా తనానికి, ఊహాలోకాల్లో విహరింప జేసే మత్తు మందుల వాడకానికి బరితెగించిన కామ విన్యాసాలకు ఆలవాలమైన అమెరికాలోనే (USA) ఈ వ్యాధి ప్రస్తుతం ఎక్కువగా వుండటాన్ని బట్టి,లా ఆ దేశాదాచాలతో పోల్చదగిన నాగరిక తెరలోకి ఇతర ఆస్ట్రేలియా, బ్రిటన్, జపాన్, పాశ్చాత్య దేశాల్లాంటి ధనిక సామ్రాజ్యాల్లో 'దడదడ' పోటుచేసుకొని వున్నది. ఇప్పుడు ముద్దులు కూడా మూలుగుతున్నాయి. ఆ ఆధునిక దేశాల్లో జిగిజిగేలు కాంతులతో వెలిగిపోతుండిన నైటు క్లబ్బులు కూడా మబ్బుల మునకేసుకున్నాయి.

ఈ వ్యాధి సోకడమనేది ఒకళ్ళ నుండి మరొకళ్ళకి కేవలం స్పర్శా మాత్రాన అంతగా అంటదు కీటలాగా, తామరలాగా, లాలాజలం కన్నీళ్ళు, రక్తం, ఇంద్రియం. ఇలా శరీర ద్రవ్యాలు వ్యాధి ఒకళ్ళ నుండి మరొకళ్ళకు వ్యాపించేందుకు తోడ్పడే ఉపద్రవాలు. కనుక ఈ వ్యాధి కేవలం లైంగిక సంపర్కం వలన వింత కామ వర్తనల వలన, మత్తు పదార్థాల వినియోగం వలననే వస్తుందనుకోరాదు. నిశిత పరీక్షలు జరగనిదే రక్తదానాన్ని కూడా అమెరికాలో ఎవరూ అంగీకరించడం లేదు. కొన్ని చిన్న ఆపరేషన్లలో కూడా రక్తం ఎక్కించాల్సిన సందర్భాలు రేకెత్తవచ్చు. కనుక మరి ఎమర్జెన్సీ అయితే తప్ప సర్జరిలన్నీ ఆయుధాల్తో కాకుండా వాయిదాల్తో ముగుస్తున్నాయక్కడ. బ్లడ్ బ్యాంకులు కూడా మూతపడే స్థాయికి చేరింది పరిస్థితి. స్వలింగ సంపర్కమన్నా, అసలు శృంగారమన్నా కంగారు పడిపోతున్నారు. ఇలా ఈ వ్యాధి ప్రస్తుతం ప్రపంచాన్నంతా ఊపుతున్నది. వైద్యశాస్త్రానికి భారాన్ని మోపుతున్నది, మత్తు మందుల వాడకాన్ని ఆపుతున్నది, మన్మథ లీలలలో ఊడ్చిన తనాన్ని మాపుతున్నది.

అమెరికాలోని హైటియన్ ప్రాంతం హోమోసెక్సువలిజాన్ని చెవు ప్రోదగినది. అక్కడ ఆ వ్యాధి ఉనికి ఉధృతంగా ఉండటాన్ని బట్టి ఇది తటస్తులలోనే అనగా ఇటు ఆడ అటు మగ కాని కొజ్జాతనానికి అభండులైన శిఖండులలోనే ఎక్కువగానూ, ముందుగానూ సోకుతున్నట్లు తేలుతున్నది. గణాంక పరిశీలనలో కూడా 70 శాతం ఇట్టి వారినే ఈ వ్యాధి ముందుగా వరిస్తున్నట్లు ఋజువైంది. మిగతా ముప్పై శాతం మాదక మందుల బానిసలకు, పలురకాల పడతులతో పొందుగోరి పలు రుచులు అందగోరే పనీ బాట లేని పరమ రసిక రాయుళ్ళకు ముందుగా తేలికగా ఈ వ్యాధి అంటుతుంది. అందునా యవ్వన ప్రాయంలోని మగవారికే ఇది ఎక్కువగా వస్తూంది. ఇప్పుడు వారి నుండి స్త్రీలకు తద్వారా పసి బిడ్డలకు అందరికీ సోకుతున్నది. అయితే ఇది నిష్పత్తి పరంగా మగవారిలో 70 శాతం ఆడవారిలో 30 శాతం వుంటున్నది.

కొన్ని ప్రాంతాల ప్రజల్లో కొన్ని వర్గాల వారిలో, కొన్ని వ్యసనాలకు తలొగ్గిన వారిలో ఇలాకొన్ని సెక్షన్ ప్రజల్నే ఈ వ్యాధి ఎందుకు ఎక్కువుగా ఆకర్షిస్తున్నది అనే ప్రశ్న ఇప్పటికి ఇదమిద్దమైన జవాబు లేక ప్రశ్న గానే మిగిలియున్నది. AIDS వ్యాధి అంటుకున్నాక, ఆ వ్యాధి లక్షణాలు అగుపించడానికి మూడు నుండి ఐదు సంవత్సరాల వ్యవధి పడ్తుంది. కనుకనే ఇది ఎవళ్ళలో వుందో, ఎవరిలో లేదో తెలియని మకతిక పరిస్థితి ఏర్పడింది.

(కొరవ పై వారం)

## సినిమా

9వ పేజీ కొరవ

### మళ్ళీ సరిత

''ఆడే కాలు ; పాడే నోరు ఊరకుండవు'' అనే ఆర్యోక్తి సరిత విషయంలో కూడా నిజమైంది. ఒక మలయాళ నటుడ్ని పెళ్ళాడి, ఓ పాప తల్లి అయిన సరిత తిరువనంతపురంలో స్థిర పడినట్లే అనుకున్నారంతా. అక్కడి దూరదర్శన్‌కు ఈమె కొన్ని సీరియల్స్ తీసింది. ఆ తర్వాత ఏమి జరిగిందో ఏమో ఒక శుభదినాన మద్రాసులో ఊడిపడింది. డబ్బింగ్ చెప్తానని కొన్ని ఫిల్మ్ కంపెనీలకు ఫోన్ చేసింది. ఇటీవల నటించడానికి కూడా సిద్ధ పడింది. ''నేను మూడో పడిలో అడుగు పెట్టినా, పాప తల్లి అయినా నాలో వరువం పోలేదు. ఇప్పటి హీరోయిన్లకన్నా నేను ఏ విషయంలో తక్కువ ? ఏ హీరో పక్కనయినా నటించి నా తడాఖా మళ్ళీ చూపిస్తా,'' అంటోందట.

పెళ్ళాడి బొంబాయికి వెళ్ళిన రాధకు కూడా ఇంకా మద్రాసు మీదే కన్ను ఉందట. దాన్నే ''మద్రాస్ ఐ'' అని కొందరు చమత్కరిస్తుంటారు. మంచి కథ అయితే తాను నటించి జాతీయ అవార్డు అందుకోవాలని ఆమె లక్ష్యమట.

### "నాని" షూటింగులో నటి షబ్నం అసిస్టెంటు గొడవ"

నెల్లూరీయుడు కృష్ణమోహన్ రెడ్డి సౌమ్యుడు. ఈయన దర్శకత్వం వహించే "నాని" చిత్రంలో మలయాళం తార షబ్నమ్‌ను బుక్ చేశారు. ఈమె అప్పుడప్పుడు ఏదో సాకు చెప్పి, తన పారితోషికాన్ని ముందే వసూలు చేసుకొని, ఆ తర్వాత షూటింగ్‌కు సహకరించడం మానేసింది. "నాని" చిత్రానికి ఇచ్చిన డేట్స్‌నే మరో సంస్థ చిత్రానికి ఇచ్చి, నానా గందరగోళం సృష్టించింది. ఫలితంగా "నాని" చిత్రం షూటింగ్‌కు ఎంతో ఆలస్యమైంది. షూటింగ్ చివరి రోజున నిర్మాణ నిర్వాహకుడు రవిశేఖర్‌ను పొట్ట పక్కన కడ్డి సమీపంలో షబ్నం మేకప్ అసిస్టెంటు చిన్న కత్తితో పొడిచాడు. దైవవశాత్తు ప్రాణాపాయం తప్పిపోయింది. ఆ మేకప్ అసిస్టెంట్ మీద పోలీసులకు ఫిర్యాదు చేయడం జరిగింది. కాని, ఈ గొడవయే తనకు తెలియదని షబ్నం అనడం వింతగా వుంది. ''కొంత దూరంలో ఏదో గలాటా జరగడం తెలుసు. అప్పుడు నేను తిరుపతికి వెళ్ళే హడావిడిలో ఉన్నాను. తిరుపతి నుంచి తిరిగి వచ్చాకే నాకీ గొడవ గురించి వివరంగా తెలిసింది. నా మేకప్ అసిస్టెంట్‌ను వెంటనే తొలగించేశాను '' అంది. తారల కన్నా వారి అసిస్టెంటులు కొందరు ఎంతో దురుసుతనంతో ప్రవర్తించడం ఇటీవల మామూలై పోయింది. ఆ తర్వాత మరో నటుని అసిస్టెంట్ కూడా తన యజమాని మెప్పుదల పొందడం కోసం దురుసుగా ప్రవర్తించాడట. ఇది 'స్వామి భక్తి' అని అనుకుంటే, తమ గొయ్యి తాము తవ్వుకున్నట్లే.

### సంక్రాంతి "చామంతి"

సంక్రాంతికి ప్రజల దగ్గర డబ్బు బాగా ఆడుతూంటుంది కనుక ఆ సమయంలో విడుదల చేస్తే తమకు బాగా డబ్బులు వస్తాయని చాలా మంది నిర్మాతలు తమ చిత్రాలను జనవరి రెండో వారంలో విడుదల చేయడానికి తొందరపడి పోవడం మామూలు. నెల్లూరీయుడు సి.ఎల్. నరసారెడ్డి నిర్మించిన ''చామంతి '' చిత్రం మాత్రం సంచలనం సృష్టిస్తుందని చాలా మంది భావిస్తున్నారు. డాక్టర్. భానుమతీ రామకృష్ణ ప్రశాంత్, రోజా, బొంబాయి నటి పప్పు వైష్ణవి, అనిత, థమ్, రాధారవి ప్రభృతులు నటించారు. జాలరుల జీవన విధానానికి సంబంధించిన ఇతివృత్తం. పాటలు. వేటూరి, సంగీతం. ఇళయరాజా, దర్శకత్వం. ఆర్.కె. సెల్వమణి.

### హాస్య చిత్రాల దాడి

హాస్య చిత్రాలంటే ద్వంద్వార్థాల సంభాషణలు పుష్కలంగా దొర్లే చిత్రాలేనని కొందరు నిర్మాతల నమ్మిక '' సినిమాలు ఎక్కువగా చూసేది తక్కువ రేటు టికెట్లు కొనే సామాన్య ప్రజలే. ద్వంద్వార్థ సంభాషణలు వాళ్ళనే ఎక్కువగా అలరిస్తున్నాయి. అలాంటి సంభాషణలు విని ఆనందించినంత మాత్రాన వాళ్ళు చెడిపోయే ప్రమాదం లేదు. కొందరు మహిళలు కూడా ముసిముసిగా నవ్వుకోవడం నాకు తెలుసు, '' అని ఒక నిర్మాత వాదన. ఈయన ''బొంకు మొగుడు – రంకు పెళ్ళాం'' అని తన చిత్రానికి టైటిల్ పెట్టాలని ఆలోచిస్తున్నాడట. తన సంభాషణల' రచయిత అన్ని రకాల మాటలు వ్రాయగల నేర్పరట. అంటే, సామాన్య ప్రజలు మెచ్చుకొని ఆనందించే రీతిలో చిత్రాలను తీస్తే తప్పులేదట. ''మరి చిత్రాల పేర్ల విషయంలో కూడా నియమనిబంధనలను కఠినతరం చేయబోతున్నారట కదా ? '' అని ఆ నిర్మాతను అడిగితే ''ఆ హక్కు వీళ్ళకెవరిచ్చారు'' పెట్టుబడి పెట్టేది నేను, రేపు నేను నష్టపోతే ఆ లోటు వీళ్ళు తీరుస్తారా ? అసలు ఈ నిబంధనలు ఎంత వరకు అమలు జరుగుతాయండీ ? ఒక పక్క మద్యం సేవించడం హానికరం అంటున్నారు. మరో పక్క వాళ్ళే అమ్ముతున్నారు. అలాగే సిగరెట్టు పీల్చడం హానికరం అంటున్నారు. మరో పక్క యధేచ్చగా అమ్మకం చేయిస్తున్నారు. సంఘంలోని పెక్కు అన్యాయాలను, అక్రమాలను ఎలా అరికట్టలేమో అలాగే ఇది కూడానూ. రేపు చిత్రం ఫ్లాప్ అయితే ప్రభుత్వానికి పన్నుల రూపంలో వచ్చే ధనం టుప్ మంటుంది. అంటే, ఈ విషయాన్ని విజ్ఞులు ఆలోచించాలి. చాలా మంది నిర్మాతల తరపున నేను అంటున్న మాటలివి అన్నాడానిర్మాత.

ప్రజల బలహీనతలు రెచ్చగొట్టే అశ్లీల చిత్రాల విషయంలో సెన్సార్ బోర్డుతో పాటు ప్రజలు కూడా కాఠిన్యం వహించకపోతే ఈ చవకబారు చిత్రాల జోరు తగ్గదు.

### చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

జయాపజయాలు చూచి నిర్ణయించవలసి వుంది. ఎందు చేతనంటే తన తొలి చిత్రం 'శివ' తో సెహాస్ అనిపించ జకున్న రాంగోపాలవర్మ మలి చిత్రంలో అభాసుపాలయ్యారు. హరీష్ తన నటనలో ప్రత్యేకత చూపాడు. కొత్త నటి హేమమాధుర్ సహజంగా నటించి సహజంగా వున్న తన అందానికి మరింత ఆకరణ కూర్చింది. శృంగార సన్నివేశాల్లో మత్తెక్కిస్తుంది. శరత్‌బాబు గంభీరంగా కనిపించారు. హరి బావగా బ్రహ్మానందం హాస్యానికి ఉపయోగపడ్డారు. వల్లభనేని జనార్దన్, చంద్రకాంత్, జయరేఖ, జ్యోతిశ్రీ వగైరాలు బాగా రాణించారు.

ఆత్రేయ మాటల్లో మంచి చమత్కారం ధ్వనించింది. సిరివెన్నెల పాటల్లో అందమైన పదచిత్రాలు కనపడతాయి. ''శ్రీకారమే ఇది ప్రణయమా నీ కావ్యంలో '' ఈ పాట బి. ఆర్. సురేష్ సంగీతంలో విని ఆనందిస్తేనే మజా వుంది. మధు మహంకాళి ఫోటోగ్రఫీ ప్రతి దృశ్యానికి ఒక సుందర అలంకరణ.

# పినాకినీ తీరం

(2 పేజీ కొరవ)

పమాచారంకు పోజరు కాకుంటే ప్రతం చెడుతుందని వెంరోజాలు కావన వరలో కూర్చొన్నారు. పర్యవసానంగా మళ్ళీ ఆపరేషన్ అవసరమై చేయించుకొని చికిత్స పొందు తున్నారు. మొదటి సారి జనార్ధనరెడ్డి శ్రుయైవా ఆస్పత్రికి పోయి ఆయన్ను పరామర్శించి తన సంస్కార శీలం తను చాటుకొని ఇటు వ్యక్తిగత ఆక్షేపణలకు, అటు శ్రీనివాసులు రెడ్డి చివాట్లకు గురియైనారు. ఆస్పత్రిలో తిరుగలేని స్థితిలో వున్న శ్రీనివాసులు రెడ్డి వరద ప్రాంతాల్లో తిరగలేదు కాబట్టి కావలి వర్కర్యాలయానికి రాజీనామా ఇవ్వమనడం మానవత్వం వుండేమాటా? పెళ్లి పోయి గ్రుడ్డును వెక్కిరించడంగా వుండదా? ఈ ప్రకటన మాచిన తర్వాత గుర్తుకొచ్చింది. రామానాయుడు గారు పక్షవాతంతో అస్వస్థులయ్యారు; క్లిష్టమైన పరిస్థితిలో వుండినారు. ఆసమయంలో నెల్లూరు లోని ఒక పత్రిక ఆయన్ను నీచంగా విమర్శిస్తూ వ్రాసింది. ఇంత హృదయంలేని మనుషులు కూడా వుంటారా అని విస్మయం కలిగింది. ఆ పత్రిక కాలగర్భంలో కలిసిపోయింది కాని ఆసన్నివేశం వాస్మృతి పథంలో మాత్రం అట్లనే నిల్చి పోయింది.

తేలుకు కుట్టడం స్వభావం. శ్రీనివాసులు రెడ్డిగారి స్వభావం అంతకంటే భిన్నం కాదని తెలియని వారులేరు. అనారోగ్యంలో పడకలోవున్నా శ్రీనివాసులు రెడ్డి జనార్ధనరెడ్డి మీద ధ్వజమెత్తాడు; ఎన్టీఆర్ పాలనకు వ్యతిరేకంగా రాష్ట్ర వ్యాప్తంగా సభలు జరిపినట్లు, జనార్ధన రెడ్డి పాలనకు వ్యతిరేకంగా మరో పర్యటన నిర్వహిస్తానని పత్రికా ప్రకటన చేశాడు. కాంగ్రెస్‌ను పుద్ధరించడానికి అని శ్రీని వాసులు రెడ్డి దాని కొకపేరు పెట్టారు. ఆయన వైఖరి కొత్తేమీ కాదు. దానికి ఉలికి పడాల్సిన అవసరమూ లేదు. ప్రకటనకు వ్యతిరేకంగా హైదరాబాదు నుండి ప్రముఖు లెవరైనా వాత బెట్టి వుంటే సమంజసంగా వుండేది. నెల్లూరు నుండి యూత్ కాంగ్రెస్ జంట జవాబు చెబితే, శ్రీనివాసులు రెడ్డిని కాంగ్రెసు నుండి గెంటివేయు మని సంపోయిస్తే లెక్క చెట్టే దెవరు? ఇటువంటి ప్రకటనలు వారి విలువను పలుకు బడిని పెంచవు సరిగదా, జనార్ధన రెడ్డి మీదకు అనవసరంగా కెచ్చగొట్టే నట్లవుతుంది. ఇది విమర్శకారు పుచితాను చితాలు విడమరిచి చెప్పడమే! ప్రహరి బయటకు పోయిన వారిని లోపలకు రమ్మని ఆహ్వానిస్తుంటే ఇతరులు లోపల వున్నవారిని బయటకు పొమ్మంటే చెల్లుతుందా, సాగుతుందా? జనార్ధనరెడ్డి అభిమానులు ఆయన ముఖ్యమంత్రిగా కొనసాగాలని కోరుకుంటే చాలదా, ప్రత్యేకంగా శ్రీనివాసులు రెడ్డిని బహిష్కరించమని అడగవలెనా?

## బూడిదలో పన్నీరు కాదా?

వరద బాధితుల అనంతరపు, ఆరోపణలు, నిందలు, విమర్శలు, పుద్యమాలు చూస్తుంటే ప్రభుత్వం పందారం చేసిన కోట్లాది రూపాయలు బూడిదలో పన్నీరు పోసినట్లు కాదా అనిపిస్తుంది. గాలిలేదు, అతివృష్టి మాత్రమే. నదులు, కాల్వలు పొంగి, చెరువు కట్టలు తెగి ఆకస్మాత్తుగా ముంచిన గ్రామాలలో తప్ప, పేదల ఇండ్లేకాదు ఎవరి కొంపలకూ నష్టం లేదు. నష్టమంతా రైతులది, రోడ్లది, గండ్లుపడిన చెరువులది. ప్రాణనష్టం కూడా అంతా వరదల వల్ల కాదు. అటువంటప్పుడు వరదలు చుట్టు ముట్టి కొంపగోడు పోగొట్టు కున్న వారికి, నదుల పొర్ల కట్టలు - దెబ్బ తిన్న రోడ్ల చెరువుల మరమత్తుల మీద, పక్కా ఇళ్ళనిర్మాణం మీద ఈ కోట్లు ఖర్చు పెట్టి వుంటే సార్థకంగా వుండేదిగాని, మూకుమ్మడిగా పంచ గజ్జాయం పడపప్పు పంచినట్లు నోట్లు వెదజల్లడం నేరం కాదా? మరప వచ్చుగాని మాన్పలేరు అంటారు. తుఫాన్ సహాయ కార్యక్రమం అవిధంగానే తయారైంది. 1976లో వెంగళరావు గారి హయాంలో ఇంతింతగా ప్రారంభమై, 1979 డాక్టర్ చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదవియానికి పటుడంతై, 1991 జనార్దనరెడ్డి ఏలికలో విరాట రూపాన్ని దాల్చింది. చివరకు ప్రభుత్వానికి మిగిలింది సహాయ పడి చెప్పు దెబ్బలు తినడం! తాత్కాలిక సహాయం సాంప్రదాయానికి స్వస్తిజరగాలి; శాశ్వతోపయోగకర కార్యాల మీద నిధులు వెచ్చింపబడాలి!

— NMR

# కాంగ్రెస్

(2 పేజీ కొరవ)

పమర్పించలేక పోయారంటే ఏమనుకోవాలి? అధికారంలో లేనప్పుడు జనార్ధనరెడ్డి ప్రతి కార్యకర్తనూ ఉత్సాహపరచి సభ్యత్వాలు కట్టించాడు. అప్పుడు కనీసం పార్టీ ఎన్నికలు కూడా లేవు. ఆ ఉత్సాహం, ఆసక్తి ఇప్పుడేమై పోయాయి. ముఖ్యమంత్రి స్వంత జిల్లాలో పార్టీ యంత్రాంగం ఇంత అధ్వాన్నంగా పనిచేయడం ఎవరికైనా పరువా? ప్రతిష్ఠా? "నవ్వి పోదురుగాక, నాకేటి సిగ్గు" అంటారా?

## కవుల పలుకులు

4వ పేజికొరవ

పీధులను, ప్రగాఢంగా అభిమానించవలె ? ఏల కృష్ణశాస్త్రి హృదయము స్వేచ్ఛను, దుఃఖమును, ప్రేమను, భగవంతుని ప్రేమింపవలె?

ఈ చివరి ప్రశ్నయే కృష్ణశాస్త్రి తన 'కృష్ణపక్షం'లో ''ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను ?'' అని ఒక తేటగీతి చివరి పాదంలో వేసినది. ఆ 'నిన్నుకు' ఆయన కవితాత్మలోని నాలుగు శాఖలలో ( స్వేచ్ఛ, దుఃఖము, ప్రేమ, భగవంతుడు ) ఏదో ఒకటిగా గుర్తించవచ్చు. మీది మూడు పాదాలలో ఈ ప్రశ్నకు సమాధానంగా నాలుగు ప్రశ్నలు వేస్తాడు. అవిగో వినండి.

''ఏల నలిలంబు పాలు ? గాడ్పేల వినరు ? సౌరభము లేల జిమ్ము పువ్వ వజ్రంబు ? చంద్రికల నేల వెదజల్లు చందమామ ?'' ఇవి ఆ నాలుగు ప్రశ్నలు. ఒక ప్రశ్నకు సమాధానంగా నాలుగు ప్రశ్నలు కృష్ణశాస్త్రి ఏల గుప్పించవలె ? ఆ నాలుగూ ఏల జరుగుతున్నవో ఇది కూడా అలాగే జరుగుతోందని ఆయన భావం. ఏల కృష్ణశాస్త్రి వంటి కవులు ఇటువంటి తిరకాను ప్రశ్నలు గుప్పించివలె. అయినా, మనమేల కృష్ణశాస్త్రిని మరువక భద్రంగా గుండెలో వదిలవరచుకోవలె ? ఏల ? ఏల ? ఏల ? ఏల ? .....

# సింహపురి

4 పేజీ కొరవ

అయితే, ఇంకొక పక్క పోలీసులూ దీనిని ప్రతిష్టా సమస్యగా తీసుకోవడంతో ప్రతిష్టంభన ఏర్పడి వుంది. తమ కానిస్టేబిళ్ళు న్యాయవాదులను తిట్టిన మాట వాస్తవమే కాని, ఆ న్యాయవాదులూ వారికి ఎదురు తిట్టారని ; వివిదానికి దిగిన కానిస్టేబిళ్లు 4 టౌన్‌కు చెందిన వారైతే, ఒకటవ టౌన్ అని కేసు పెట్టడం వల్ల, మొత్తం స్టేషన్‌లోని పోలీసులందరికీ అవమానం జరిగిందని, అందువల్ల న్యాయవాదులే తమకు క్షమాపణ చెప్పాలని పోలీసులు వాదిస్తున్నారు. జిల్లా జడ్జి, కొందరు సీనియర్ లాయర్లు కలిసి ఇరువర్గాలకు మధ్య చేసిన రాజీ ప్రయత్నాలు ఫలించలేదు. రెవిన్యూ అధికారులూ పోలీసులను సమర్థిస్తున్నట్లుంది.

ఈ సమస్యను ఎవరు పరిష్కరిందాలో, ఎవరు ఉద్యోగం చేసుకొని చిక్కుముడి విప్పాలో ఎవరికీ అర్థం కావడం లేదు. రెండు వర్గాలూ పట్టుదలకు పోతున్నాయి. హైకోర్టుబార్‌నూ రంగంలోకిదింపే ప్రయత్నం జరుగు తున్నది. న్యాయవాదుల ఆందోళన సమంజసమైనది. కోర్టు ఆవరణంలో న్యాయవాదులకు రక్షణ లేని పరిస్థితి ఏర్పడడం ఎక్కడకు దారి తీస్తుందో వూహించుకోవచ్చు. పోలీసులను వదిలేస్తే ఫలితాలు దారుణంగా వుంటాయి. కోర్టుల భయం ఒకటి వుండబట్టి ఇట్లా వుంది కాని, లేకుంటే ప్రతి పోలీసు స్టేషనూ ఒక లాకప్ డెత్ కేంద్రంగా తయారు కాదా ?

---

కావలి డి। ము॥ కోర్టులో అసలు నె 48/1990 దు

షేక్ మహబూబ్ మస్తాన్ - వాది

మైలారి జెసన్న అలెగ్జాండర్ -

క్వార్టర్ నెం. 8
పోలీస్ ఆఫీసు సమీపం
దర్గామిట్ట.
నెల్లూరు. 524003

ప్రతివాది

ప్రతివాదికి తెల్పునదేమనగా

వాది పై నంబరున నీపైన ప్రామిసరి నోటును బట్టి దావా దాఖలు చేసి వున్నాడు. నీకేమైనా ఆక్షేపణలున్నచో తే 19.12.91 ది పగలు గం 10.30 లకు పై కోర్టు వారి ఎదుట హాజరై తెలుపుకోవలెను. లేనిచో మీ పరోక్షమున తీర్మానించె దరని తెలుసు కోవలెను.

19.12.91 జి. మాలకొండయ్య
వాది తరుపు అడ్వకేట్

---

## సంస్మరణ

మా కుటుంబ శ్రేయోభిలాషి, ఆత్మీయుడు. కీ.శే. దూబగుంట నారాయణరావుగారు పరమ పదించి తే. 6.12.91 దినాటికి సంవత్సరం నిండినది. వారి ఆత్మకు చిరశాంతి చేకూర్చాలని భగవానుని ప్రార్థిస్తూ,

టెక్కేమిట్ట, నెల్లూరు. — రేవూరు హనుమంతరావు, రాధిక

---

## ప్రకటన

## పురపాలక సంఘము , నెల్లూరు

తేది 3.12.91

ఆర్ ఓ సి. నెం ఇ1/91

ఇందు మూలముగా యావన్మంది కంట్రాక్టుదారులకు తెలియ చేయడమేమనగా తే 14.11.91 దిన వెలువడి టెండరు నోటీసు నందు ఈ క్రింద సుదహరించిన బడిన నెంబర్ల గల పనులు తుఫాను భారీ వర్షములమూలంగా మినహాయించడమైనది. 25.11.91 తేది వెలువడిన ప్రకటన నోటీసులోని కొన్ని మార్పులనుమరియు తే 11.12.91 ది నుండి జరగబోవు ఎన్.జి.ఓ సమ్మె మూలముగా తే 30.11.91 దిన వెలువడిన ప్రకటన నోటీసులోని తేదీల మార్పులను గమనించవలసినదిగా మున్సిపల్ కంట్రాక్టర్లను కోరడమైనది.

| | |
|---|---|
| 1. టెండరు షెడ్యూలు రుసుము చెల్లించు తేది | 9.12.91 |
| 2. టెండరు షెడ్యూలు జారీ చేయు తేది | 21.12.91 నుండి |
| 3. టెండరు దాఖలు చేయు తేదీలు | |
| 1నుండి 100 వరకు | 26.12.91 మ॥ 2 గం॥ |
| 101 నుండి 200 వరకు | 27.12.91 " |
| 201 నుండి 306 వరకు | 28.12.91 " |
| 4. టెండరు తెరచు తేదీలు | |
| 1 నుండి 100 వరకు | 26.12.91 మ॥ 3గంటలకు |
| 101 నుండి 200 వరకు | 27.12.91 |
| 201 నుండి 306 వరకు | 28.12.91 |

గమనిక : పూర్తి వివరములు ఆఫీసు వేళలందు విచారించి తెలిసుకొనవలెను.

R

కె. శ్రీనివాసులు
మునిసిపలు హెల్త్ ఆఫీసరు మరియు కమీషనరు,
నెల్లూరు మునిసిపాలిటీ.

---

## ఉత్తరక్రియలు



పాత నెల్లూరు జిల్లా బోర్డు మెంబరు మాజీ గుడ్లదొన పంచాయితీ ప్రెసిడెంట్

### అమిరి శెట్టి వెంకట సుబ్బయ్యగారు

గుడ్లదొన

30.11.91 తేది శనివారం రాత్రి స్వర్గస్థులైరి.

వారి ఉత్తర క్రియలు

11.12.91 తేది బుధవారం శిలాప్రతిష్ఠ

12.12.91 తేది బేస్తవారం శిలోద్యాసన (పెద్దకర్మ)

గుడ్లదొన గ్రామంలో మా స్వగృహమున జరుగును.

బంధు మిత్రులు తెలియ గోరుతాము

— అమిరిశెట్టి వెంకటసుబ్బారావు
(రత్నపుత్రుడు)

# పెండ్లిండ్లు

నెల్లూరు పెస్టిసైడ్స్ వ్యాపారి శ్రీ అన్నదేవుల వరాశివ రెడ్డి కుమారుడు - అంటే రిటైర్డ్ కలెక్టరు, నెల్లూరు తాసిల్దారుగా ధర్మరాజు వంటి అధికారి అనికీర్తిగన్న అన్నదేవుల రామచంద్రారెడ్డి మనుమడు, ఎ.టి.ఎ.టి. జుడీషియల్ సభ్యుడుగా ఉన్న శ్రీ వెంకటరెడ్డి, డాక్టర్ హరిశ్చంద్రారెడ్డిల తమ్ముడి కుమారుడు. జిల్లా జనతాపార్టీ అధ్యక్షుడు ఎస్.ఎస్.రాయల్ రెడ్డి బావమరిది తనయుడన్నమాట - శ్రీకాంత్; వరకవిపూడి, శ్రీ అగస్త్యరెడ్డి ధర్మారెడ్డి కుమార్తె హరిత పరిణయం నవంబరు 17వ తేది నెల్లూరు-శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో జరిగింది.

× × ×

నెల్లూరు ఎ.సి.టి.ఒ. శ్రీ పాములాజపల్లి సుబ్బయ్య కుమార్తె నీరజ బి.ఎ., నెల్లూరు ఎ.సి.నగర్ వాసులు శ్రీ తోటపల్లి రామసుబ్బయ్య కుమారుడు గోపాలకృష్ణ వివాహం 23 తేది ఆంధ్రపథలోని దుగ్గిశెట్టి సుబ్రహ్మణ్యం శెట్టి కళ్యాణ భవన్‌లో జరిగింది

× × ×

కావలి హోల్ సేల్ వ్యాపారం, కాంట్రాక్టుల వ్యాపకం, వానిశెట్టిపాడు సర్పంచిగా రాజకీయ కాలక్షేపం చేసిన వెరువు సేద్యపు వ్యాసంగం గలిగిన కలిసివచ్చిన "విశ్వం" పొందరుడైన శ్రీ బండి రామస్వామిరెడ్డి తనయుడు ద్వారక పరమేశ్వరరెడ్డి; శ్రీ బుర్ర రాధాకృష్ణారెడ్డి తనయ మాధవి పాణిగ్రహణం 28వ తేది నెల్లూరు టి.టి.డి. లో జరిగింది.

టి.టి.డి. పెళ్ళంటే కార్ల బార్లతో బ్రంకురోడ్డు ట్రాఫిక్ రద్దీ సంగతటుంచి దాని దర్పంతో నేత్రపర్వంగా ఉంటున్నది.

× × ×

బ్రహ్మదేవీయుడు శ్రీ ఊరందూరు వెంకటాచలమయ్య నాయుడు (వెంకయ్య) కుమార్తె పద్మజ; తోటపల్లి - తోటపల్లి ఆదిశేషయ్య నాయుడు కుమారుడు రామమోహన్ బి.ఎ., బి.ఇ.డి. వివాహం 28వ తేది నెల్లూరు పర్మనెంట్ ఫండ్ ఆఫీస్ భవనంలో జరిగింది.

× × ×

గోనుపల్లి - శ్రీ ఎస్. రవీంద్రరెడ్డి కుమార్తె, శ్రీలత; కడప జిల్లా ఇండ్లూరు గ్రామవాసి శ్రీ జె.వెంచురెడ్డి కుమారుడు సాయి ప్రసాద్ రెడ్డి పెండ్లి 28వ తేది నెల్లూరు శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో జరిగింది.

× × ×

కనిగిరి తాలూకా వాసి హైదరాబాద్ -ఎ.పి.సి.సి.ఎ.డి.బ్యాంక్ అసిస్టెంట్ మేనేజర్ శ్రీ తూమాటి జయరాం నాయుడు పుత్రుడు విజయానంద చౌదరి; శ్రీ ముల్పూరు విష్ణువర్ధనరావు పుత్రిక ప్రవీణ పరిణయం 30వ తేది విజయవాడ విద్యానగర్‌లో బొబ్బా లక్ష్మణరావు నివాసంలో జరిగింది.

****

పోయిన వారం అంటే '22.11.91' తేది పత్రికలో పెండిండ్ల శీర్షికలో పొరపాటు జరిగింది. స్వర్గీయ అల్లూరి సుబ్బరామానాయుడు కుమార్తె పెండ్లి, గుండాలమ్మపాలెం అల్లారెడ్డి జగన్మోహనరెడ్డి కుమార్తె పెండ్లి వార్తలు అచ్చులో కలగాపులగమై పోయాయి. పొరపాటుకు క్షమించండి. ఆ రెండు పెండిండ్ల వార్తలు ఈ క్రింద ఇస్తున్నాము.

× × ×

ముత్తుకూరు మండలం కొత్తపాళెం స్వర్గీయ అల్లూరి సుబ్బరామానాయుడు కుమార్తె, అంటే రెవిన్యూ శాఖీయుడు శ్రీ అల్లూరి సుందరరాజయ్య అన్న కుమార్తె జ్యోత్స్న; బిట్రగుంట శ్రీ తోటపల్లి కుమారుడు జనార్దన్ పెళ్ళి 8 తేది నెల్లూరు శ్రీ ఏనుగ సుందరరామిరెడ్డి రోటరీ కళ్యాణ మండపమునందు జరిగింది.

× × ×

కొడవలూరు మండలం నాయుడుపాళెం వాసి శ్రీ అల్లారెడ్డి జగన్మోహన రెడ్డి కుమార్తె కృష్ణప్రియ తోటపల్లి గూడూరు మండలం చిన్న చెరుకూరు శ్రీ గూడూరు వెంకట నారాయణ రెడ్డి కుమారుడు వసంత కుమార్ రెడ్డి వివాహం 13 తేది నెల్లూరు టి.టి.డి లో జరిగింది.

✺

## సణుగుడు

( 4 వ పేజీ తరువాయి )

స్థిరాభిప్రాయాలు కల్గిన వ్యక్తి ఒకేసారిగా సాయిబాబా కాళ్ళకు నమస్కారం పెట్టాడంటే ఆశ్చర్యపడాల్సిన విషయమే కదా ? ఆస్తికత్వం, ఆధ్యాత్మికత, దేముడి పట్ల భక్తి విశ్వాసం వుండటంలో తప్పులేదు. తప్పు పట్టాల్సిన విషయమూ కాదు. కాని సెక్యులర్ భావాలు పుష్కలంగా కల్గిన వ్యక్తిలో సాయిబాబాలకు మొక్కే చాంచల్యం కల్గడం ఏ పరిణామ క్రమాన్ని సూచిస్తుంది ?

సత్యసాయిబాబా దగ్గరకు 1967 ప్రాంతంలో తొలిసారిగా వెళ్లాడట జనార్దనరెడ్డి. అయితే అందరితో పాటు నమస్కారం చేయకుండా నిల్చునే సరికి ''నీకు నాపై నమ్మకం కల్గటానికి మరో ఇరవై ఏళ్ళ సమయం వుంది '' అన్నాడట సాయిబాబా. ప్రధాన మంత్రితోటి పుట్టపర్తి వెళ్ళిన తాను అక్కడి భవనాలు, అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలు చూసి ముగ్ధుడనై బాబాకు మొక్కానని ఆయన చెప్పినట్లే సరిగ్గా ఇరవైదేళ్ళకి ఇది జరగడం విచిత్రమని జనార్దనరెడ్డి చెప్పారట. కాకతాళీయంగా జరిగే ఇటువంటి సంఘటనలే ఛాందస భావబీజాలు నాటుకోవడానికి సహకరిస్తుంటాయి.

విజపిల రాకపోకలు పెరిగే కొద్దీ సాయిబాబాకు ప్రజల్లో ఉచిత ప్రచారం లభిస్తున్నది; మహాత్మ్యాన ప్రాకి పోతున్నాయి.

## రాజధాని రాజకీయం

(మొదటిపేజీ తరువాయి)

వెళ్ళటప్పుడు సైతం కారు వద్దకు వచ్చి నమస్కారము చెప్పాడు. 'ఏరా ''పోరా' అని తిట్టిన సంధ్యాల సంఘటన ఇద్దరూ మరిచిపోయినట్లు కనిపించారు. రాజకీయ నాయకులకు సిగ్గు, పౌరుషం, రోషం వంటివి ఉండవేమో.

హనుమంతరావులో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పుకు కారణమేమిటి? ఢిల్లీ పెద్దల సలహాఅని కొందరు చెప్తారు. రాజశేఖరరెడ్డి వర్గానికి మాత్రం ఈ పరిణామం రుచించడం లేదు. శత్రువుకు శత్రువైన వాడు తమకు మిత్రుడన్న వైఖరితో వారు జనార్దన రెడ్డి అనుచరలందరిని చిన్నా పెద్దా తేడాలేకుండా దువ్వకుంటూ పోతున్నారు.

## మాదాల

(మొదటిపేజీ తరువాయి)

లేకుంటే ఈ తిట్లలో సగభాగం ఆయనకూ చెంది వుండేవి ! రేపు అసలు జాబితా బయట పడిన తర్వాత కూడా ముఖ్యమంత్రి పైకంటే

మాదాల పైన అలిగే వారి సంఖ్యే ఎక్కువగా వుంటుంది. విచిత్రమేమిటంటే పేరు వ్రాయలేదని తిట్టేవారే తప్ప పేరు వ్రాసినందుకు థ్యాంక్స్ చెప్పిన ఎమ్మెల్యేలు ఒక్కరు కూడా కనిపించడం లేదు.

✺



Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books Pvt. Ltd, Nellore